సంచిక : 32 విడి ప్రతి : రు. 2.00 లు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

అజిత్ ఎమ్మెల్యేలను ఆంధ్రాభవన్‌లో దాచిపెట్టారా?

# ఢిల్లీ పైనే కోట్ల ఆశ!

ప్రధాన మంత్రి పదవి పై తనకు మోజు లేదని ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి బయటకు చెబుతున్నా ఆయన అంతరంగం మాత్రం ఢిల్లీ కోట పైనే వుంది. పి.వి. నరసింహా రావు అవిశ్వాస తీర్మానం పై నెత్తు పెట్టుకుంటున్న సమయంలో సైతం కోట్ల వారు తన అనుయాయుల్ని పురిగొల్పి ప్రధాని పదవికి గాలం వేసిన దాఖలాలున్నాయి. కోట్ల వారి వార్ కోర్ అనుచరులు తమిళనాడు ఎంపీ ప్రభుతో పాటు పి.వి. ని బహిరంగంగా వ్యతిరేకిస్తున్న కె.ఎస్. సింగ్ ప్రభృతులు ప్రధాని పదవిని కోట్లకు కట్టబెట్టాలని సంతకాల సేకరణ కూడా చేశారు. ఎటొచ్చీ కోట్ల పేరుకు ఎంపీల్లో అంతగా ప్రతిస్పందన లేక పోవటంతో ఈ ప్రయత్నం కాగితాలకే పరిమితమైంది. దక్షిణాదికి చెందిన పి.వి.ని గద్దె దించే పక్షంలో తిరిగి దక్షిణాది వారికే ప్రధాని పదవి కట్టబెట్టాలని కోట్ల అనుయాయుల వాదన. దక్షిణాదికి సంబంధించినంత వరకు ఆంధ్ర, కేరళ ముఖ్యమంత్రుల పేర్లు ప్రచారంలో వున్నాయి. కేరళ ముఖ్యమంత్రి కరుణాకరన్ పట్ల సిపిఎం తీవ్ర వ్యతిరేకతతో వుంది. అదీగాక కరుణాకరన్‌కు ఉత్తరాది వాతావరణంతో పరిచయం తక్కువ కాబట్టి అందరికీ ఆమోద యోగ్యుడుగా, సీనియర్ ఆయిన కోట్లకే ప్రధాని పదవి ఇవ్వాలని కోట్ల అనుయాయులు కోరుతున్నారు. దీని వల్ల ఉత్తరాది వారికి కోపం వచ్చే పక్షంలో అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్ష పదవిని ప్రధాని నుంచి వేరు చేసి ఉత్తరాది వారికి కట్టబెట్ట వచ్చుని వీరు సర్ది చెబుతున్నారు. అయితే కోట్ల మాత్రం బహిరంగంగా ముందుకు వచ్చేందుకు జంకుతున్నారు. రేపు పి.వి. గనక గద్దె దిగాల్సి వస్తే వారసుడిగా తన పేరు చెప్పించుకో వాలని కోట్ల అనుకుంటున్నారు. అందుకే ఆయన పి.వి.కి అండగా వున్నట్లు కనిపిస్తున్నారు. అలాగే ప్రచారం కూడా చేసుకుంటున్నారు. అవిశ్వాస తీర్మానం పై ఓటింగ్ సందర్భంగా అజిత్ వర్గం నుంచి ఫిరాయించిన ఏడుగురు ఎంపీలను ఆంధ్రా భవన్‌లోని తన సూట్‌లో ఉంచుకొని కోట్ల వారు కంటికి రెప్పలా కాపాడారు. దీనితో పి.వి.ని కాపాడేందుకు కోట్ల వారు ఎంతో రిస్కు తీసుకున్నట్లు బయటి ప్రపంచానికి కనిపించింది. ఒక వైపు పి.వి. రక్షణ అంటూనే మరో వైపు తన అనుయాయులను పురిగొల్పి ప్రధాని పదవికి చాపకింద నీరు తెచ్చే ప్రయత్నం ముమ్మరం చేశారు. పార్టీ శ్రేయస్సు దృష్ట్యా తప్పుకోండని పి.వి. పై ఒత్తిడి తెచ్చే విధంగా కోట్ల అనుయాయులు తాజా ప్రచారం ప్రారంభించారు.

### కోట్ల పై ఫిర్యాదుల పరంపర

ముఖ్యమంత్రి మూవ్‌మెంట్స్ జాగ్రత్తగా గమనిస్తున్న రాష్ట్ర నాయకులు కొందరు ఆయన పై ప్రధానికి ఫిర్యాదు చేశారు. కర్నూలు జిల్లాకు చెందిన మాజీ ఎంపీ శ్రీ అయ్యపురెడ్డి ఇటీవల

కొరవ 12 పేజీలో

## ఎన్టీఆర్‌కు ఏమైంది?

తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు ఎన్టీరామారావు వైఖరి ఆ పార్టీ వారికే తలనొప్పిగా తయారైంది. మాజీ మంత్రి చంద్రశేఖర్‌కు నివాళులర్పిస్తూ 'చంద్రశేఖర్ రెడ్డి గారు' అంటూ సంబోధించారు. చంద్రశేఖర్ రెడ్డి గారు వైద్య ఆరోగ్యశాఖ మంత్రిగా గణనీయమైన సేవలందించారు. గత ముఖ్యమంత్రి దగ్గర ఆయన ఆర్థిక మంత్రిగా పనిచేశారని ఎన్టీఆర్ అనడంతో సంతాప సభలో నవ్వులు విరిశాయి. బిసిలకు చెందిన చంద్రశేఖర్ ఎప్పుడూ వైద్య ఆరోగ్య శాఖను గానీ ఆర్థిక శాఖను గానీ నిర్వహించలేదు. ప్రతి పక్షనాయకుడికి ఈ మాత్రం ప్రాథమిక పరిజ్ఞానం కూడా లేకపోవడం ఆ పార్టీ వారికే విసుగు కలిగించింది

## ముఖ్యమంత్రి చిరాకు!

శాసన సభలో ముఖ్యమంత్రి తరచూ సహనం కోల్పోతున్నారని అధికార పక్షీయులు తలలు బాదుకుంటున్నారు. రాష్ట్రంలో పదేళ్లుగా వర్షాకాల సమావేశాలు లేవు. ముఖ్యమంత్రి ఎందుచేతనో వారం రోజుల పాటు శాసన సభ సమావేశాలు ఏర్పాటు చేసి ఆ ఆనవాయితీకి బ్రేక్ వేశారు. అంత వరకు బాగానే వుంది కానీ ఆయన పట్టుమని పది నిముషాలైనా సభలో కూర్చోవాలంటే చిరాకెత్తి పోతున్నారని అధికార పక్షీయు లంటున్నారు. సభ తొలి రోజున మాజీ మంత్రి చంద్రశేఖర్ మృతి పట్ల సంతాప తీర్మానం ప్రవేశ పెట్టారు. పార్టీకి ఒకరు వంతున చంద్రశేఖర్ గురించి మాట్లాడడం మొదలు పెట్టారు. తీర్మానం ఆమోదించాక సభ ఎలాగూ వాయిదా పడుతుంది కాబట్టి సభ్యులు తాపీగా మాట్లాడు తుండగా ముఖ్యమంత్రి మాత్రం వాచీ చూసుకోవడం మొదలెట్టారు. తొందరగా సభ ముగించండి అంటూ ఆయన స్పీకర్‌కు కబురు మీద కబురు చేశారు. దాంతో విసిగి పోయిన స్పీకర్ సభ్యులను నిరాశపరుస్తూ సభను మరుసటి రోజుకు వాయిదా వేశారు.

ఉపఎన్నికల వాయిదాతో

# విస్తరణ తప్పని స్థితి!

రాష్ట్రంలో వచ్చే సెప్టెంబర్ నెలలో జరగాల్సి వున్న ఉప ఎన్నికలు వాయిదా పడ్డాయి. కర్నూలు లోక్ సభతో పాటు ఇచ్ఛాపురం, తాండూర్ అసెంబ్లీ స్థానాలకు జరగాల్సిన ఎన్నికలను తిరిగి ప్రకటించే వరకు వాయిదా వేస్తున్నట్లు ఎన్నికల సంఘం ప్రధానాధికారి శ్రీ శేషన్ ప్రకటించి అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తారు. కర్నూలు లోక్‌సభ స్థానానికి ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి కుమారుడు సూర్యప్రకాష్ రెడ్డి పోటీ చేస్తున్న విషయం తెలిసిందే. ఎన్నికలకు మరింత వ్యవధి దొరకటం మంచిదేనని ముఖ్యమంత్రి వర్గీయులు ఆనంద పడిపోతుండగా ముఖ్యమంత్రి మాత్రం ఇబ్బందిలో పడ్డారు. ఉపఎన్నికల కారణంగా మంత్రి వర్గ విస్తరణను వాయిదా వేసినట్లు ముఖ్యమంత్రి ప్రకటించిన కొన్ని రోజులలోనే ఉపఎన్నికలు వాయిదా పడ్డాయి. ఎలాగూ ఉపఎన్నికలు లేవు కాబట్టి విస్తరణను చేపట్టాలని ఎమ్మెల్యేల నుంచి వత్తిడి పెరిగే అవకాశం వుంది. మంత్రి వర్గ విస్తరణను ఎప్పటికప్పుడు అప్పురేపు అన్న మాదిరిగా దాటేస్తున్న ముఖ్యమంత్రికి ఎన్నికలు వాయిదా పడటం అట్టే రుచించడం లేదు. ఉపఎన్నికలో తనయుడి కోసం ముఖ్యమంత్రి తన శత్రువుల్ని సైతం ఇంటికి పిలిపించుకొని బుజ్జగించారు.

### తనయుడి కోసం తపన

కర్నూలు లోక్ సభకు కోట్ల సూర్యప్రకాష్ రెడ్డి పేరు ఖరారు కావడంతో కొడుకు గెలుపు కోసం ముఖ్యమంత్రి తన దృష్టిని కర్నూలుపై కేంద్రీకరించారు. కర్నూలు లోక్ సభ పరిధిలో వున్న డోన్ అసెంబ్లీ నియోజక వర్గం శాసనసభ్యుడైన కె.ఇ. కృష్ణమూర్తిని కోట్ల వారు పిలిపించుకొని బుజ్జగిస్తున్నారు. చిరకాల శత్రుత్వం మరచి కె.ఇ. తండ్రి కె.ఇ. మాదన్నకు స్వయంగా ఫోన్ చేసి మాట్లాడటం ముఖ్యమంత్రి తపనను తెలియ జేస్తోంది. రాష్ట్ర నాయకుల్లో తన వారసుడిగా కుమారుడ్ని నిలబెట్టాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. దీని కోసం

కొరవ 12 పేజీలో

ముఖ్యంగా కర్నూలు జిల్లాకు చెందిన మాజీమంత్రి కె.ఇ. కృష్ణమూర్తికి ఉపఎన్నికల తర్వాత మంత్రి వర్గ విస్తరణలో స్థానం కల్పిస్తానని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారట. ఎలాగూ ఉప ఎన్నికలు లేవు కాబట్టి విస్తరణ అంటూ చేయాల్సి వస్తే కె.ఇ. కృష్ణమూర్తికి మంత్రి పదవి ఇవ్వాల్సి వుంటుంది. పదవి ఇచ్చాక ఎన్నికల్లో కె.ఇ. వైఖరి ఎలా వుంటుందో నన్న అనుమానం ముఖ్యమంత్రిని వెన్నాడుతోంది.

### నక్సలైట్లతో సంబంధాల నింద, సిఎంతో వైరం కలత పెడుతున్నాయి!

# చిక్కుల్లో పడ్డ స్పీకర్!

రాష్ట్ర శాసన సభ స్పీకర్ శ్రీపాదరావు ఇబ్బందిలో పడ్డారు. స్పీకర్‌కు నక్సలైట్లతో సంబంధా వ్నాయని, ఇందుకు తగిన సాక్ష్యాధారాలు గల ఫోటోలు తమ వద్ద వున్నాయని కరీంనగర్ జిల్లా ఎస్పి బహిరంగంగా ప్రకటించారు. శాసన సభకు సంబంధించి వంత వరకు అత్యున్నత పదవిలో వున్న స్పీకర్ పై ఇటువంటి ఆరోపణల్ని స్వయాన ఎస్.పి చేయడం అధికార పార్టీని ఇరుకున పడేసింది. శ్రీపాదరావు అంటే మండిపడుతున్న ముఖ్యమంత్రి ఈ విషయమై పెదవి విప్పలేదు. హోంమంత్రి మైసూరా రెడ్డి కూడా ఖండించ లేదు. అధికార పార్టీలోని ఈ బలహీనతను ఆసరా చేసుకొని ప్రతిపక్షాలు శాసన సభలో సావధాన తీర్మానానికి ఉద్యమించాయి. స్పీకర్ మాత్రం ఈ పరిణామాల పట్ల కలత చెందినట్లు కనిపిస్తున్నారు. "ముఖ్యమంత్రి తనను అవమాని స్తున్నారని" స్పీకర్ గారు తన సన్నిహితుల వద్ద వాపోతున్నట్లు వినికిడి. ముఖ్యమంత్రికి స్పీకర్‌కు మధ్య వున్న వైరం ఏ పరిస్థితులకు దారితీస్తుందో?

### కెఇకి మంత్రిత్వం హామీ ఇచ్చి కొరివితో తల గోక్కున్నట్లైంది!

# చిన్న పత్రికల ప్రపంచానికిరేరాజు!

[జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్ నెల్లూరు శ్రీరామమూర్తి గారి హఠాన్మరణానికి సంతపాలు తెల్పుతూ ఇంకా అనేక సందేశాలు వస్తూనే వున్నాయి. వాటి ప్రచురణ ఈ వారంతో ముగిస్తున్నాము]

చిన్న పత్రికల ప్రపంచానికి రేరాజు. వినయ విజ్ఞాన శీల్య రాశి శ్రీరామమూర్తి గారు. ఆయన చర్చించే విషయాలను మేధావులు కూడా కొత్త విషయాన్ని విన్నట్లు అబ్బుర పడుతూ చదివే వారు. అదే ఆయన ప్రత్యేకత.

విశాఖపట్నం —చిత్రకవి ఆత్రేయ

## గొప్పగుణం

తన కలల ప్రతిరూపమైన 'జమీన్‌రైతు' ఆఫీసునుతానే దగ్గరుండి నిర్మించుకొన్న సంకల్ప సిద్ధులు శ్రీరామమూర్తి గారు. ఆయనలోని గొప్ప గుణం — సామాన్యులతో కూడా ఎంతో ఆప్యాయంగా వారి పేరుతో సంబోధించి తనే పలుకరించే వారు. జర్నలిజంలో కాకలు తీరిన వారైనా గర్వం లేదు. స్మిత ప్రజ్ఞులు. అంత్య క్రియలకు వచ్చిన వారిని చూస్తే చాలు — వారి జనప్రియానికి వేరే కొలబద్దక్కరలేదు.

నెల్లూరుతిరుమూరు నారసింహా రెడ్డి

## కీర్తి ప్రతిష్టలు తెచ్చారు

శ్రీ రామమూర్తి గారి మరణం తెలుగు పత్రికా రచనా వ్యాసంగానికి తీరని లోటు. తెలుగు పత్రికా రచనా వ్యాసంగానికి కీర్తి ప్రతిష్టలు సంపాదించి పెట్టిన ఘనులు శ్రీరామమూర్తి గారు. తెలుగు పత్రికల్లో ఈనాటికి 'మణిపూస' గా వెలుగొందుతున్న 'జమీన్‌రైతు'ను మరింత శోభాయమానం చేయ వలసిన బాధ్యత ఇప్పటి తరం పై వుంది.

మద్రాసు —ఐ. వెంకటేశ్వర రావు
సీనియర్ జర్నలిస్ట్



## అరుణాంజలి

మిత్రులు శ్రీరామమూర్తి గారి మరణం మమ్ములను ఎంతో హృదయ వేదనకు గురి చేసింది. ఆయన ఆశయ సాధనకు వారసులు ముందుకు సాగాలని అరుణాంజలి ఘటిస్తున్నాము.

హైదరాబాదు—సరి నాగభూషణరావు
కార్యదర్శి, సి.పి.ఐ.

## మరువలేను!

నా శ్రేయోభిలాషియైన శ్రీ శ్రీరామమూర్తి గారి మరణ వార్త పత్రికల్లో చూసి నోట మాటరాలేదు. హైదరాబాద్‌లో వుండే నేను మా గ్రామంలోని దేవాలయపు జీర్ణోద్ధరణ కార్యక్రమం చేపట్టి తరచూ నెల్లూరు వస్తూ ఆయనను కలిసే వాడిని. స్నేహమూర్తి శ్రీ రామమూర్తి గారిని నేను కలకాలం మరవలేను.

హైదరాబాద్ —డి. కామయ్య

## చిన్ననాటి స్మృతులు

నా చిన్ననాటి మిత్రులు శ్రీరామమూర్తి గారిని గత సంవత్సరం అక్టోబర్ నెలలో కలుసు కొన్నపుడు చిన్ననాటి స్మృతులు గుర్తుకు తెచ్చారు. గూడూరులో శ్రీ అనపల్లి సుబ్బరామ రెడ్డి ఇంటి మేడ పై వున్న

కొరవ 12 పేజీలో

## జనరల్ నోటీసు

నా క్లయింటు అయిన శ్రీమతి లింగారెడ్డి సరోజనమ్మ భర్త లేటు యల్.వి. రమణారెడ్డి, లక్ష్మీపురం, నెల్లూరు గారి సంజాయిషీ మేరకు యావన్మందికి తెలియ చేయడమేమనగా నెల్లూరు టింబరు మర్చంట్స్ అసోసియేషన్ వారు 30.7.93 తేదీన జమీన్‌రైతు వార పత్రికలో ప్రకటించిన నోటీసులోని విషయములు వాస్తవము కాదని ఖండించుచూ యదార్థ విషయములను ఈ ప్రకటన ద్వారా తెలియ చేయడమైనది. నెల్లూరు టౌను రంగనాయకులపేట వార్డు నెం. 8 డోరు నెంబరు 233/9బి గల రాఘవ కళ్యాణ మండపమునకు దక్షిణము వైపున గల 224 అంకణముల స్థలము, నా క్లయింటు భర్త గారైన శ్రీ యల్. వి. రమణారెడ్డి గారి స్వాధీనానుభవములో 20 సంవత్సరముల పై బడి వుంటున్నది. శ్రీ ఎల్.వి. రమణారెడ్డి గారు అనుభవము మీద హక్కు కలిగి వున్నారు. నెల్లూరు టింబరు మర్చంటు అసోసియేషను వారు యల్. వి. రమణారెడ్డి గారి స్వాధీనానుభవములో ఈ స్థలము ఉన్నదని స్వాధీనము కొరకు వారి పై నెల్లూరు సబార్డినేటు జడ్జి వారి కోర్టులో ఒ.యస్. నెం. 102/85 క్రింద దావా చేసి వారికి పై స్థలములో హక్కులేదని కేసు ఉపసంహరించుకున్నారు. యల్.వి. రమణారెడ్డి అండ్ కంపెనీ పై స్థలమును టింబరు యార్డు క్రింద అనుభవించు కొనుచున్నారు. ఈ స్థలములో టింబరు మర్చంట్స్ అసోసియేషను వారికి గాని, మరి ఎవరికి గాని ఎలాంటి హక్కు అధికారము లేదు. ఎల్.వి. రమణారెడ్డి గారి తదనంతరం నా క్లయింటుకు పై స్థలము నందు పూర్తి హక్కు అధికారము ఏర్పడినది.

కె. రాజగోపాలరెడ్డి
అడ్వొకేటు

తేది: 4.8.93

# సణుగుడు

## * అయ్యో పాపం, ఆనం సంజీవ రెడ్డి!

ఆనం సంజీవ రెడ్డి గారు రెంటికీ చెడిన రేవడి అయిపోయారు; పాపం! సల 'క్ష్మ' ణంగా, కృష్ణా రామా అంటూ కాలం గడప వలసిన వారు స్వయంకృతా పరాధంతో స్వగతాలు చెప్పుకుంటూ కాలక్షేపం వేయవలసి వస్తున్నది. డెబ్బయ్యేళ్ల వయస్సు, యాభై ఏళ్ల రాజకీయానుభవం ఆయనకు అవసర సమయంలో వుపయోగ పడలేదు.

కోవూరు ఉప ఎన్నిక తర్వాత శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి పై విమర్శలు చేయడమే సంజీవ రెడ్డి గారు చేసిన తొలి తప్పు. అది అనాలోచితంగా జరిగిందో, అన్యుల ప్రేరేపణతో జరిగిందో కాని, ఆ మాటకే నిలబడి వుండి వుంటే కనీసం బెట్టు నిల్చి వుండేది. దాని తర్వాత సైతం "వారైనా, వీరైనా గింగిరాలు తిరగాల్సిందే కదా" అని వీరత్వం ప్రదర్శించడం రెండవ తప్పు. అంతటి వీరత్వంతో మిడిసి పడిన వారు అవతలి వారి ప్రతిస్పందన తెలుసుకోకుండా తొందర పడి భీరువుగా మారి, చెంపలేసుకొని, గుంజీళ్లు తీయడానికి రెడీ కావడం ఇంకాపెద్ద తప్పు. శిశుపాల వధకు నూరు తప్పుల వరకు ఛాన్సు వుండింది; సంజీవ రెడ్డి గారి రాజకీయ వధకు మూడంటే మూడు తప్పులు సరిపోయాయి. అది గుర్రపు రథాల ద్వాపర యుగమైతే, ఇది జెట్ విమానాల స్పీడు యుగం కదా? ఒక మిత్రుడు వ్యాఖ్యానించారు — ఎవరో హత్య చేస్తారని భయపడి సంజీవ రెడ్డి గారు తన తలను తానే తెగనరుక్కున్నారు అని; శ్రీ కృష్ణ పరమాత్ముడంత వాడికి వేటగాడి బాణంలో రాసిపెట్టి వుండింది; ఈయన

### డోలేంద్ర

రాజకీయ జీవితానికి ఒకే ఒక పత్రికా ప్రకటనతో చరమాంకం రచింప బడడంలో విచిత్రమేముంది?

సంజీవ రెడ్డి గారు ఇందిరాభవన్ సభలో చెప్పిన బేషరతు క్షమాపణ మాగుంట సుబ్బరామ రెడ్డికి సమ్మతం కాలేదు. అంతకు ముందు రోజె గెస్ట్ హౌస్‌లో మాగుంట సోదరులలో ఒకర్ని కలిసి, తనంతట తానుగా కల్పించుకొని మాట్లాడి, పదే పదే సారీ చెప్పారట; అందుకూ వారు ప్రతిస్పందించ లేదు. ఢిల్లీకి ఫోన్ చేసి సుబ్బరామ రెడ్డి గారితో మాటలు కల్పబోతే లైన్ డిస్కనెక్ట్ అయింది. నో రెస్పాన్స్ సైన్ ఇంత స్పష్టంగా ఎర్రలైటు వెలిగినట్లు కన్పడుతున్నా, ఏదో "అవసరార్థం", బరువు దించుకోవాలనే ఆదుర్దాలో వున్న సంజీవ రెడ్డి గారు దాన్నిచూడలేక పోయారు. ప్రక్కరోజు క్షమాపణతో అందరి కోపాలు చల్లారి, తన శాపం తీరిపోతుంద నుకున్నారు. కాని దురదృష్టం — అది వికటించింది.

ఇందిరా భవన్ తొలి సభలో తన మానం కాపాడను వచ్చి, తమ స్నేహితాలు, రాజకీయ ప్రయోజనాలు త్యాగం చేసి, తన ప్రక్కన నిలబడిన యువ సోదరు లిద్దర్నీ విస్మరించి, తనంతట తానుగా రాజీకి తొందరపడి వారిని దూరం చేసుకున్నారు; కుటుంబంలో వెంటరి వారు కావడంతో పాటు — అందరి ఛీత్కారాలూ పొందుతున్నారు; పార్టీలో ఎగతాళి పాలైనారు. ఇంకోక ప్రక్క వ్రతం చెడినా "ఫలితం" దక్కలేదు. ఈ వయస్సులో సంజీవరెడ్డికి ఇంత కంటే పెద్ద శిక్ష అవసర మేముంటుందనుకోలేము. మాగుంట సుబ్బరామ రెడ్డి వైఖరి స్పష్టంగా వుంది. తనను తిట్టి, తన పై నిందలువేసి, తన వారిని అవమానించిన సంజీవ రెడ్డితో

కొరవ 10 పేజీలో

## స్మృత్యంజలి

మరణిస్తే గదా సంతాపసభ!
సుహృజన మనోమందిర
పద్మపీఠి పై విదురించే
నిర్మల మనసికె నెందుకయ్యా సంతాప సభ?
నేస్తం! చెబితే విన్నావా?
నెల్లూరు శ్రీరామమూర్తి
మరణించాడంటావు నువ్వు!
నెల్లూరున్నది కదా!
శ్రీరామమూర్తి ఉన్నట్లు జమీన్‌రైతు
జమీన్‌రైతే శ్రీరామమూర్తి కదా!
జమీన్‌రైతుంటే శ్రీరామమూర్తి ఉన్నట్లు కాదా!
ఓ పత్రిక బతికి బట్ట కట్టేందుకు
ఓ పత్రిక వజ్రోత్సవం చేయించుకునేందుకు
ఓ పత్రిక దేశదేశాల ఖ్యాతి గాంచేందుకు
ఆ పత్రికాధిపతి భూమ్యాకాశాలు బద్దలు చేయాలి
ఆ జీవనం అకుంఠిత దీక్షతో
రక్తస్వేదాలు ఆజ్యంలా అర్పించాలి!
ఓ శ్రీరామమూర్తి!
నీవు నిద్రలేని రాత్రులెన్ని గడిపావో?
మేధోవ్యధ నెంత అనుభవించావో?
కూసింత విశ్రాంతి తీసుకో వేదుకైందా?
లేదూ, మొనమొన్ననే రామానాయుడు
విగ్రహప్రతిష్ఠ జరిగింది కదా!
విగ్రహం ప్రక్క విగ్రహంగా నుండ మనసైందా?
అయినా శ్రీరామమూర్తి!
నెల్లూరుక మీ వంశానికెందుకింత మక్కువ?
ఇంటి పేరునేనెల్లూరు చేసుకున్నారు గదా!
నాన్న పేరు బసివి నాయుడు
చిన్నాన్న పేరు రామానాయుడు
నీవేమో శ్రీరామమూర్తివా!
కులరక్కసిని కూకటివ్రేళ్లతో
కూల్చి వేసేందుకు మీరే సాక్ష్యం కావాలి?
తెలిమల్లెపూవంటి మనసుతో
శ్వేత వసన పరిధానంతో
నిర్మోహమాట వైఖరితో
సర్వాంగ సుందరం చేసిన
జమీన్‌రైతు మా కనుల ఎదుట నుండగా
నీకు మరణమెక్కడయ్యా?
జయంతితే సుకృతినో
రససిద్ధాః రచయితాః

పచ్చిపులుసు వెంకటేశ్వర్లు
తెలుగు లెక్చరరు, వెంకటగిరి

# జమీన్‌రైతు
## అభిశంసనే మేలు

దేశంలో జరగవలసిన అన్ని ఎన్నికలనూ హఠాత్తుగా వాయిదా వేస్తూ ఎన్నికల కమీషనర్ తీసుకున్న నిర్ణయంలో ప్రజాస్వామ్య వ్యవస్థను పెడదారి పట్టించే దుస్సంకల్పం కన్పిస్తున్నది. తన అధికారాలను గుర్తించి, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తన ఆజ్ఞలకు బద్ధులై వుండడానికి ఒప్పుకున్నంత వరకు ఏ ఎన్నికా జరపనని ఆయన చేస్తున్న ప్రకటనలు ఆయన అహంభావాన్ని సూచిస్తున్నాయి. తమిళనాడులోని పళని, రాణీపేట ఉపఎన్నికలకు కేంద్ర బలగాలను పంపే విషయంలో మొదట పేచీ తల ఎత్తింది. రాష్ట్ర ప్రభుత్వం పై తనకు నమ్మకం లేదు కాబట్టి, పారా మిలటరీ దళాలను పంపాలని శేషన్ కేంద్ర హోం శాఖను ఆదేశించారు. ఆ ప్రకారం సైన్యాన్ని పంపుతూ, రాష్ట్ర ప్రభుత్వాలు అడగకుండా తనంతట తానుగా సైన్యాన్ని పంపే అధికారం కేంద్రానికి, పంపమని ఆదేశించే అధికారం ఎన్నికల కమీషనర్‌కు లేదని హోం శాఖ స్పష్టం చేసింది. దీన్ని పెద్ద అవమానంగా భావించారు శేషన్ గారు; ఎవ్వరి అధికారాలేమిటో తేలే వరకు ఎన్నికలే జరపనని భీష్మ ప్రతిజ్ఞ చేశారు. తన చిత్తం వచ్చినప్పుడల్లా ఎన్నికలను రద్దు చేయడం, వాయిదా వేయడం శేషన్‌కు ఒక ఆట అయిపోయింది. దీని వల్ల దేశంలో ప్రజాస్వామ్య, రాజకీయ వ్యవస్థలు తరచు గందరగోళానికి గురౌతున్నాయి. ఇప్పుడు కూడా మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ శరద్ పవార్ పోటీ చేస్తున్న పూనా స్థానిక సంస్థల శాసన మండలి ఎన్నికను పోలింగు రోజున వాయిదా వేశారు. ఆ ఎన్నిక వాయిదా పడితే ఆయన ముఖ్యమంత్రిగా కొనసాగడానికి వున్న 6 నెలల వ్యవధి గడిచి పోతుందని తెలిసీ చివరి నిముషంలో ఈ నిర్ణయంతీసుకున్నారు. ఇక్కడి ఓటర్ల సంఖ్య కేవలం నూరు; వంద మంది ఓటర్లున్న ఈ నియోజక వర్గంలో శాంతి భద్రతల సమస్య దేశంలో నెలకొని వుందా? అసలు అన్ని ఏర్పాట్లూ పూర్తయిన తర్వాత ఎన్నికను వాయిదా వేసే అధికారం కమీషన్‌కు వుందా? దాని వల్ల ఇటు ప్రభుత్వానికి, అటు అభ్యర్థులకు ఎంత నష్టం? ఎంత కష్టం? లోక్ సభ ఎన్నిక అంటే ఖర్చు కోట్లలో వుంటున్నది; అదంతా బూడిదలో పోసిన పన్నీరౌతున్నది.

చాలా సంవత్సరాల నుంచే శేషన్ తలతిక్క మనిషి వలె వ్యవహరిస్తున్నారు. వ్యక్తిగత కోపతాపాలకు తన అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డితో తనకున్న పేచీ కారణంగా పాణ్యం ఉపఎన్నికకు పెట్టిన అభ్యంతరాలు, కల్పించిన చిక్కులు చికాకులు చూశాం; పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసుతో మాట పట్టింపుకు పోయి, రాజ్యసభ ఎన్నికలు రద్దు చేసి కేంద్ర వాణిజ్య మంత్రి ప్రణబ్ ముఖర్జీ రాజీనామాకు కారకుడైనాడు; త్రిపుర రాష్ట్ర శాసన సభ ఎన్నికలను అర్థంతరంగా వాయిదా వేసి కొన్ని వందల మంది అభ్యర్థులను క్షోభ పెట్టాడు; ఇప్పుడు తనకు బుద్ధి పుట్టినంత వరకు ఏ ఎన్నికా జరపను పొమ్మంటున్నాడు.

ఇటువంటి తలతిక్క మనిషి చేతిలో, దురహంకారి చేతిలో ప్రజాస్వామ్య వ్యవస్థ చిక్కుబడడం శోచనీయం. ఎన్నికల కమీషనర్‌ను తొలగించే అధికారం కేంద్రానికి లేదు. పార్లమెంట్‌లో అభిశంసన తీర్మానం చేయడం ద్వారా మాత్రమే అతడికి ఉద్వాసన చెప్పాలి. అంతటి తీవ్రమైన చర్య ఎందుకని ప్రభుత్వం ఇన్నేళ్ల పాటు తటపటాయిస్తున్నది. ఇంక ఆ నాన్పుడు అనవసరం. శేషన్ చేతిలో అధికారం కొనసాగితే ప్రజాస్వామ్య వ్యవస్థ మనుగడ అనుమానాస్పదమౌతుంది; అపహాస్యం పాలౌతుంది.

అభిశంసన ఆలస్యంతో కూడిన విషయం కాబట్టి, అంత వరకు ఎన్నికలు జరపకుండడం దేశానికి క్షేమకరం కాదు కాబట్టి, జ్యోతిబసు సూచించిన విధంగా ఎన్నికల కమీషన్‌ను త్రిసభ్య సంఘంగా మార్చి, శేషన్ అధికారాలను కత్తిరించడం; ఆ తర్వాత ఆయన్ను తొలగించడం సమంజసం. ప్రతిపక్షాలూ ఇందుకు సహకరిస్తాయి కాబట్టి, తటపటాయింపు అనవసరం.

దీనితో పాటుగా ఎన్నికల సంఘం అధికారాలు, విధులను మరింత స్పష్టంగా నిర్వచిస్తూ పార్లమెంట్‌లో శాసనం చేయాలి. ఎన్నికలను ఎప్పుడు జరపాలి, ఎప్పుడు వాయిదా వేయాలి, ఏ కారణాలైతే వాయిదా వేయవచ్చు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఎన్నికలకు ఏ రీతిలో సహకారం ఇవ్వాలి, వారి బాధ్యతలేమిటి అన్న అంశాలు విశదంగా చర్చించి, అనుమానాలకు తావు లేకుండా ఆ శాసనంలో నిర్దేశింప బడితే తప్ప, భవిష్యత్‌లో ఇటువంటి వివాదాలను నివారించే వీలు కలుగదు.

అభిశంసన వరకు రానివ్వకుండా శేషన్ తనంతట తానుగా తప్పుకుంటే అందరికీ గౌరవం, ఎవరికీ విశ్వాసం లేని పరిస్థితిలో పదవిలో కొనసాగడం కంటే పరువు తక్కువ వేరొకటి వుండదు. ఆయనలో ఆ జ్ఞానోదయం కల్గాలని ఆశిద్దాం!

## జమీన్‌రైతు

6.8.1943

4 పేజీలు అణా:

### అవీ-యివీ

#### తపాలపెట్టె విలాపము

నేను టవున్‌హాలుకు ఎదుట రోడ్డులో బిడ్డలు గడ్డలులేని తలవెడ్డ బ్రాహ్మణి అత వితంతువు మాదిరి మోటుగా నిలబడియున్నాను. నన్ను గత ఆగస్టులో అల్లరిపిల్లలు తల, కడుపు, పగలగొట్టారు. నావలెనే దెబ్బలు తిన్న యితర వస్తుభూతాలన్నీ బాగుపడ్డవి. నా కర్మమేమిటో నా దిక్కు మొక్కు చూచిన ప్రాణి లేదు. ఈనాటికి నేను ముత్తైదువుగా వున్నానని కొందరు కళ్ళున్న గుడ్డివారు నా కడుపులో వుత్తరాలు వేసి పోతుంటారు. వాటిని నాకుదొరుకోయిన తపాలా బంట్రోతులు -అంటే అల్లరిపిల్లకాయలు వాటిని అప్పటికప్పుడే సెన్సారుచేసి డెడ్‌లెటరు ఆఫీసనే ప్రక్క మురుక్కాలవలో పారవేస్తుంటారు. ఆ వుత్తరాలు వ్రాసుకొన్న పెద్దమనుష్యులు వాటికింకా జవాబు రాలేదని తపాలా బంట్రోతుల చుట్టు బాకీలు దండే కోమట్లమాదిరి చుట్టకపట్టక తిరుగుతుంటారు. ఈలావుంది నాగతి. మాటి మాటికి కొంటెపిల్లకాయల చేత నన్ను రాళ్లతో కొట్టించే దానికంటె నన్ను ఇక్కడ నుండి తొలగించడమో ? లేక యింత పసుపుకుంకుమ పెట్టి నలుగుర్లో తిరుగా తలెత్తుకొని తిరిగేట్టు చేయడమో? బాగుంటుందని మా డిపార్టుమెంటు వారికి ఘోరున ఏడుస్తూ మనవిజేస్తున్నాను.

-ఆ తపాలా పెట్టె.

#### పోట్లపూడి

మశూచికమనే పెద్దమ్మవారు జపానువాడి ఏజంటాఅన్నట్లు వూళ్ళో [illegible]పించింది. పెద్ద రటుల్లారా ! ఈ వీను బుద్ధితో సాగనంపండయా!

-పౌరుడు.

#### లేబూరు ప్రెసిడెంటుకు వాపుదెబ్బ

[illegible] మా వూరు రైతుసంఘ ధర్మకర్త [illegible] రెడ్డి రమణారెడ్డి గారిని ఎవరో [illegible] 20 రాత్రి పదకొండు [illegible] పొడిచారు. ఆసుపత్రిలో చికిత్సం [illegible]న్నారు. ప్రాణ గండం తప్పినట్లే. ఈవ్యక్తికి విరోధులే లేరె, ఎట్లా జరిగిందబ్బా!

-ఒకరు.

#### చేతావని మార్పులు

బాతాఖానీ

చిత్రగుప్తుడు

నవనాగరికులు కొందరు చేతావనివ్రాతలు అబద్ధమన్నారు. మూర్ఖం చేయవాదిమాటలు అన్నతమన్నారు.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

హోరావిలాస్ జోస్యం అసత్యమన్నారు. కాని సామాన్య జనమేమో యివితోసి వెయ్యలేదు. ఆగ్రహణంకోసం, ఆలోక చుక్కకోసం, ఆగ్రహగతికోసం ఎదురు జూస్తునే ఉండినారు. (ఆగస్టు 1తేది నాడు ప్రపంచం తల్లక్రిందవుతుందని మన వారి నమ్మకం ధనం దాచి పెట్టుకొన్నవారికి, వీలుంటే దోచుకుందామనుకొన్నవారికి 31 తేదిరాత్రి నిదరబట్టలేదు. మేమంతా కళ్ళు ములుంకుంటూ ప్రపంచం ఏంమారిందో చూద్దామని ట్రంకురోడ్డు వచ్చాము. నెల్లూరు ప్రపంచమంటే ట్రంకురోడ్డేగా! ఇట్టే చూతుంగదా. పెద్దమార్పు!! ఏమిటి? 31 తేది సాయంత్రందాకా శేశవరాం అండ్‌కో అని ఉన్న గుడ్డల షాపు అమాంతంగా మారి 1 తేది తెల్లవారేటప్పటికి "దివాకర్ స్టోర్" అని బోర్డు తగిలించుకొని కూర్చున్నది. జనమంతావిభ్రాంతిలోందారు. చేతావని వ్రాతలు నమ్మని దద్దమ్మలంతా వెలుగొరుక్కున్నారు. ఇంకా బజారు దాకా గూడా పోయిచూతాము అక్కడేమి మార్పులో అని పోదుముగా! అదిలోబా! అంతామార్పే! సృష్టి బుట్టింది మొదలుకొని జూలై 31 తేది రాత్రిదాకా గునపాటి చల్లపిల్ల శెట్టి, ఆయన తర్వాత ఆయన పుత్రరత్నము వైన్ మర్సంటు రాధయ్యగుప్త అంగట్లో పీటమీదకూర్చొని వ్యాపారం జేసేవారు. ఆ చమత్కారపు మాటలన్నీ గూడా ఆ కొయ్యపీటలే వారికి నేర్పినవి. చెప్పకుండా పాపం ! ఆపీటల్ని పీకిపారవేసి టేబిలు కుర్చీలు వేసుకొని కూర్చోవడం, వచ్చిన వారు ఎంత పెద్దమనిషైనా వచ్చినట్టు చేతులుగట్టుకొని నిల్చొని అడగడంగా మారింది. అబ్బే! ఎంతమార్పు!! ఎంతమార్పు!! అట్లే చంద్ర అండ్ కోలోగూడా టేబిలు వ్యాపారం ప్రారంభమైంది. ఈ మార్పుకు ప్రజలంతా నిర్ఘాంత పోయినారు. పోనీ కూరగాయల బజారు గూడా చూద్దామని అట్లపోదుముగా! కూరగాయల గుణమే మారిందండీ ! ఎంత లేత వంకాయ చూచినా కరుణి (కనరు అంటారు చిత్రదేయులు) ఇంతటితో మనవానికి నిర్ధారణైంది. ఇదంతా చేతావని దెబ్బరా, లోకమక్క మహత్యంరా అని నమ్మి, మొదట ఆక్షేపించిన ప్రబుద్ధులంతా చెంపలేసుకొని తద్దోషపరిహారార్థం మాదరన్ హోటలుకు పోయి ఒక కప్పు కాఫీ తాగి (ఈకాఫీ ఫస్టుక్లాసిటీ లెండి!)అందరు ఎవరెవరి దారిన వాండ్లు యిండ్లకు పోయినటు వంటివారైరి. ఇతిబాతాఖానిపురాణేన చేతా వని ఆధ్యాయః

# ప్రజల్లో చైతన్యం లేక పోవడమే దేశ సమస్యలకు కారణం!

దేశంలో మెజార్టీ ప్రభుత్వం లేక పోవడం వల్ల ఎన్నో సమస్యలు వుత్పన్నమవుతున్నాయి. మైనార్టీ ప్రభుత్వం తన వునికిని నిరూపించు కొనేందుకు పడుతున్న పాట్లలో ప్రజాస్వామ్య విలువలే హరించుకు పోతున్నాయి. అవకాశ వాద నాయకులు అమ్ముడు పోయారు. ఈ విషయాన్ని ప్రజలంతా గమనిస్తూనే వున్నారు. కాని ఎందువల్లో చైతన్య వంతంగా ప్రవర్తించడం లేదని నేను భావిస్తున్నాను. గట్టి ప్రభుత్వం స్థిరమైన నిర్ణయాలు తీసుకోగలదు. దేశాన్ని ముందుకు తీసుకపోగలదు. అటువంటి వారినే ఈ సారైనా బలపరచాలని ఇప్పటి నుండే ఒక స్థిర నిర్ణయం తీసుకోవాలి. లేకుంటే దేశంలో ఇప్పుడున్న పరిస్థితులను బట్టి మనదేశమూ రష్యావలె ముక్క చెక్కలు అవుతుందేమో?

గూడూరు —ఆవుల కొండయ్య

## జనవాణి

### అన్నీ షాపుల్లో వెట్టిచాకిరే!

జూలై 16 తేది జమీన్‌రైతు సంచిక జనవాణి శీర్షికలో మెడికల్ షాపుల్లో మోసాలు అన్న వుత్తరం చదివాక ఇది రాస్తున్నాను. మెడికల్ షాపులే కాదు. అన్ని వ్యాపార సంస్థలలోనూ గుమాస్తాలు, వెట్టి చాకిరి చేయిస్తున్నారు. ఉదయం 8గంటలకు షాపుకు వచ్చింది మొదలు రాత్రి 10 గంటల వరకు బయట అడుగు పెట్టడానికి లేదు. భోజనం సమయంలో కూడా కాసింత విరామం ఇవ్వరు. ఆదివారం ఉదయం కూడా పని చేయాలి. బహుశా యాజమానుల భార్యలు ఒప్పుకోకుంటే ఆ రోజు మధ్యాహ్నం కూడా మహానుభావులు పనిచేయిస్తారు. రోజు 12 గంటల పనికి జీతం 600. వున్నత చదువులు చదివి, వుద్యోగం రాక కూలి పని చేయలేక బ్రతుకు తెరువు కోసం షాపుల్లో పని చేసే వారి జీవితం దుర్భరంగా తయారైంది. కూలీల్లో వర్గీకరిస్తే మా కన్నా బేల్దారి కూలీలు వందరెట్లు నయం. లేబర్ ఆఫీసర్లు వున్నారు. చేసేది శూన్యం. అయ్యా కలెక్టర్ గారు మా దైన్య పరిస్థితి గమనించి రాత్రి 8.30 కన్నా అంగళ్లు మూతపడేలా చర్యలు తీసుకోండి.

నెల్లూరు —బాధిత గుమాస్తాలు

### నిద్రలేవండి

ఇటీవల జమీన్‌రైతులో టౌనులోని డ్రైనేజీ, పంట కాల్వల పై దురాక్రమణలను బట్ట బయలు చేశారు. కాని ఇంతవరకు మునిసిపాలిటీ, పి.డబ్ల్యుడి. అధికారులు, స్పందించిన పాపాన పోలేదు. కనకమహల్ పక్క[illegible]

కొరవ 12వ పేజిలో

## సంతాప సభలో శ్రీరామమూర్తి గారికి నివాళి

# 'ఆనాటి మొక్కను మహావృక్షం చేసిన ఘనత ఆయనదే'

టౌనులోని రచయితలు, సాంస్కృతిక సంఘాలు కలిసి సంయుక్తంగా 3 తేదీ టౌన్‌హాల్‌లో డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారి అధ్యక్షతన సంతాప సభ జరిపి జమీన్‌రైతు శ్రీరామమూర్తి గారికి అంజలి ఘటించాయి.

డాక్టర్ గోపాల్ రెడ్డి మాట్లాడుతూ స్వర్గీయ వెంకట్రామా నాయుడు గారు వేసిన 'జమీన్‌రైతు' అంటుకు నీరు పోసి, మొక్కను చేసి, ఫలాలు పండించిన ఘనత శ్రీరామమూర్తి గారికే దక్కింది. నెల్లూరు టివిరే 'జమీన్‌రైతు' లేదు 'జమీన్‌రైతు' టివిరే నెల్లూరు లేదన్న సామెత వాడుకలో రావడానికి శ్రీరామమూర్తి గారు ఎంత శ్రమించి వుంటారో వేరే చెప్పనక్కర్లేదు. జిల్లా ప్రజల సమస్యలు, కావలసిన సమాచారాలకు దర్పణం పట్టింది కాబట్టి అది ప్రజల పత్రికయింది. శతాబ్ది వయస్సున్న తెలుగు పత్రికా వ్యవస్థను సింహావలోకనం చేసుకొంటే ఇటువంటి పత్రిక ఎక్కడా కానరాదు. అనాడున్న ఆంధ్రపత్రికలో కష్టతరమైన భాష పాఠకులకు అసౌకర్యంగా వుండేది. రామానాయుడు గారు తెలుగు పత్రికా లోకంలో గ్రామీణ భాషను తొలిసారి ప్రవేశ పెడితే శ్రీరామమూర్తి గారు దానిని మరింత సరళం సుబోధకం చేసారు. శ్రీరామమూర్తి గారి కన్నా రామానాయుడు గారితోనే నాకు సన్నిహిత సంబంధా లుండేవి. 1937 ఎన్నికల్లో నా విజయానికి ప్రధాన పాత్ర వహించిన జమీన్‌రైతుని మరువలేను. రామమూర్తిగారి పినాకినీతీరంలోని రాజకీయ సమీక్షలు తరచూ నన్ను ఆలోచింపజేసేవి. నా కన్నా వయస్సులో చిన్నవారైన శ్రీరామమూర్తి గారిని అకాలంగా మృత్యువు కబళించి తీరని వ్యథ మిగిల్చింది అన్నారాయన.

శ్రీరామమూర్తి గారి ఆప్తమిత్రుడు న్యాయవాది శ్రీ పి.వి. రమణారెడ్డి 47 ఏళ్ల క్రితం నాటి తమ స్నేహాన్ని నెమరు వేసుకున్నారు. సాహిత్య రంగానికి ఆయన చేసిన సేవలు ఎవరూ చేసి వుండరు. సొంత రచనలు, రచయితలకు ప్రోత్సాహం, సమీక్షలు, పలువురికి వ్యక్తిగతంగా వుపయోగపడిన తీరుకు కొలబద్దలేదు. స్వర్గీయ ఎ.సి. సుబ్బారెడ్డి సంతాప సంచికలో ఆయన వ్రాసిన మాటలు సాహితీ కళాఖండాలుగా నిలిచి పోతాయన్నారు. కవి మిత్రులతో గంటల తరబడి సంభాషించడం శ్రీరామమూర్తి గారికి మక్కువ. అందువల్లే ఆంధ్ర రాష్ట్రంలో పేరుగాంచిన రచయితలు సమీక్షల కోసం తన రచనలు జమీన్‌రైతుకు పంపడం ఆనవాయితీ అయ్యిందని చెప్పారు.

వర్తమాన సమాజం అంటే శ్రీరామమూర్తి గారికి ఎనలేని అభిమానమని, తిరిగి తమకు అంతటి అభిమాన ధనుడు ఎవరు దొరుకుతారని శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి గద్గద స్వరంతో అన్నారు. 1963లో తమగ్రామానికి సంబంధించిన ఒకవార్త ప్రచురణ అయినప్పుడు కలిగిన పరిచయం తర్వాత ప్రగాఢంగా వున్న నాలోని రచనా శక్తి తట్టి లేపిన ప్రేమాస్పదుడు శ్రీరామమూర్తి గారని అభివర్ణించారు. ఆచార్య పి.సి. రెడ్డి తాను వి.ఆర్. కాలేజీలో అధ్యాపకునిగా పనిచేస్తున్నప్పుడు విద్యార్థి నాయకుడైన శ్రీరామమూర్తి గారి మాట విని దొరలు టోపీ పెట్టుక రావడం మానేశారని. ఆయన ప్రొఫెసర్ ఎన్.జి. రంగాను తనకు పరిచయం చేశారని. అప్పటి నుండి ఖద్దరు ధారణ అలవాటు చేసుకొన్నా నన్నారు. న్యాయవాది సుందరాచారి మాట్లాడుతూ పేరులో ఏముందంటారు; పేరులో జిల్లాను ప్రతిబింబింప చేయడం శ్రీరామమూర్తి గారికే చెల్లింది. 65 సంవత్సరాల గా నడుస్తున్న వార పత్రిక ఇంకెక్కడైనా వుందో లేదో తనకు స్ఫురణకు రావడం లేదన్నారు. న్యాయవాది మద్దాలి మల్లిఖార్జున రావు తనది శ్రీరామమూర్తి గారిది ఒకే గ్రామం కావడం వల్ల తన పై ఎనలేని ప్రేమ చూపేవారని తనను పలు విధాలుగా ఆదుకొన్న ఆయన ఋణం తీర్చుకోలేని దన్నారు. సభలో

కొరవ 15 పేజీలో

### అశ్రుతప్తనయనం!!

- వేపకొమ్మ గోపాల రావు

నీ కలం ఆగిపోయింది
పినాకినీ తీరం మూగబోయింది
వాలుకుర్చీలో కూర్చునే
లోకాన్ని దర్శించిన మేధస్సు
కాలుకదపకుండానే
జమీన్‌రైతును పెంచి
పెద్దజేసిన యశస్సు
పత్రికా వ్యాసంగాన్ని
ప్రభావితం చేసి
చరిత్రగతిని
దశాబ్దాలుగా మోసి
అద్భుత రచనాశైలి
శిల్పాన్ని, అక్షర రూపాల్లో చూసి
అర్ధంతరంగా వెళ్లిపోయిన
సింహపురి ఘనకీర్తి
భావితరం జర్నలిజానికి
నిత్యసత్య స్ఫూర్తి
నెల్లూరు శ్రీరామమూర్తి
నీవులేని ఈ దినం
చెదరి చెమర్చిన
అశ్రుతప్తనయనం

### అక్షరాంజలి

— ఈమని వెంకట కృష్ణయ్య

కం. అతులితపదబంధంబుల
ప్రతిలేక వెలుంగునట్టి "పత్రిక" తానై
నుతులంబొందిన ఘనవా
కృతురుడు "శ్రీరామమూర్తి" స్వర్గంబరిగెన్

తే.గీ. తనదు పినతండ్రి "రామానాయుడు" ఘనముగాను
పాదుకొల్పిన "పత్రిక" ప్రథితకీర్తి
కాంతులీనంగ, దశదిశల్ క్రమ్ముకొనగ,
జేసినట్టి "మనీషిని" చేరి కొలుతు

ఆ.వె. మంజుభాషణుండు మాండలికంబుల
"రైతు పత్రికందు" రాణగలుగ
వ్రాసి, రాజకీయ పరిణతి బొందిన
పండితుండు లేడు, మనకు నేడు

తే.గీ. జన్మనందిన ప్రతివాడు చచ్చు నిజము
లోకమందున, కాని, సుశ్లోకుడైన
"రామమూర్తిని" మృత్యుకరాళదంష్ట్ర
జిక్కజేసిన విధిని యేసీత్కరింతు!

మ.కో. రైతు యుద్యమమందు మిక్కిలి రాటు దేలిన పత్రికై
నీతి బాహ్యపు వార్తలన్నిటి నేర్పు మీరవిమర్శలన్
ఖ్యాతి జేయుచు వెల్గుచుండును గాదె! నేడు "జమీన్‌రైత్"
ప్రీతితో బరియింతు రెప్డు దు బెద్దలున్ మరి పిల్లలున్

### పాత్రికేయ సూర్యుడు!

అవిశ్రాంత పోరాటంలో
అలుపెరుగని వ్యక్తి ఆయన!
బ్రతుకంతా జర్నలిజపు
నిప్పుకణాల మీద నడచిన
ధీరోదాత్తుడాయన!
వార్తల్లో చిత్రాలు గీసి
వ్యంగ్య విమర్శ నాస్త్రాలు సంధించిన
కలం వీరుడాయన!
సమస్యను పరిశీలించి
పరిశోధించి తీర్పు చెప్పే
న్యాయమూర్తి శ్రీరామమూర్తి!
ఎందరున్నారు.....
వ్యాఖ్యల్ని ఊపిరిగా చేసుకొన్న వాళ్లు
వార్తల్ని సవాళ్లుగా స్వీకరించిన వాళ్లు
వయసు బంధించి బాధించినా
వార్ధక్యం ముందుగా వచ్చి భేదించినా
ప్రతినిత్యం ప్రజల్ని ప్రేమించే మనిషి!
తనరాతల్లో పథనిర్దేశం
చేసిన పంపాదక ఋషి!
ప్రజాజీవితాన్ని శ్వాసించి
వారి బాధల బొగ్గు పులుసువాయువుకు
అక్షరాకృతి కల్పించిన
నిఖార్సయిన పాత్రికేయుడాయన!
కరతలామలకమైన జిల్లా సమస్యల్ని
వారం వారం పినాకినీ తీరంలో
పలుకరించిన సూర్యుడాయన!
వార్తకు వాడి కల్గించిన
సవ్యసాచి!
తన బాణితో వేడి కల్గించిన
అక్షరాయుధ కాణాచి!
ఆయనే జమీన్‌రైతు
శ్రీరామ్మూర్తి
పాఠక హృదయాల
నిరంతర స్ఫూర్తి
మరణమెక్కడుంది
ఆ జర్నలిస్టు యోధుడికి?
ప్రజా సమస్యల్ని నెత్తికెత్తుకొని
ప్రతివారం జమీన్‌రైతుగా
పలుపరించే ప్రచండ భానుడికి!

- చిన్ని నారాయణ రావు





## నెల్లూరు సంగతులు

### పోతన జయంతి

వర్తమాన సమాజం పోతనజయంతి సభను 8 తేదీ టౌన్ హాల్‌లో జరుప బోతున్నది. సంగీత సాహిత్య కళానిధి శ్రీ ఇలపావులూరు కామేశ్వర రావు అధ్యక్షించే ఈసభలో ప్రొఫెసర్ శలకా రఘునాథశర్మ భాగవతంలోని కృష్ణతత్వం అంశం పై వుపన్యసించి సన్మానం స్వీకరిస్తారు. కుమారి ఎ.పి. మైథిలి, ఎన్. సౌజన్య, ఎన్.ఎల్. బృందావనిల గాత్ర కచ్చేరి వుంటుంది.

### జాతీయ స్థాయిలో వ్యాస రచనా పోటీ

బరోడాలోని చంచలబా అమిన్ ఛారిటబుల్ ట్రస్ట్, బొంబాయిలోని ఫోరం ఆఫ్ ఫ్రీ ఎంటర్ ప్రైజస్ సంయుక్తంగా జాతీయ స్థాయిలో వ్యాస రచన పోటీలు నిర్వహిస్తున్నాయి. సమాజం పై బంద్‌లు, సమ్మెల ప్రభావంఅనే అంశం పై వ్యాసాలను గ్రాడ్యుయేట్, పోస్టు గ్రేడ్యుయేట్ విద్యార్థులు అక్టోబర్ 30 తేదీలోగా పంపవచ్చు. వ్యాసాలను ఇంగ్లీషులో 2000 పదాలకు మించక టైప్ చేయించి, ప్రతి పేపర్ పై భాగాన విద్యార్థి వివరాలు, చివరన సంతకం పెట్టాలి. చదువుతున్న కాలేజ్ ప్రిన్సిపాల్ చేత ధృవీకరింప బడిన మూడు కాపీలను రిజిష్టర్ పోస్టులో సెక్రటరీ, ఫోరం ఆఫ్ ఫ్రీ ఎంటర్ ప్రైజస్, పిరామల్ మాన్షన్, మూడవ అంతస్తు, 235, డాక్టర్ డి.ఎన్. రోడ్, బొంబాయి - 1, అనే అడ్రసుకు పంపాలి.

### సారా పోరాటంపై గూడూరులో టెలి ఫిలిం

గూడూరు దాసరి నారాయణ రావు కళానిలయం సారా ఉద్యమ

కొరవ 15 పేజీలో

జిల్లావార్తలు

# కలెక్టర్ గారూ, అంత దుడుకుదనం వద్దు!

తన మండలం వాటంబేడును సారా క్రిమినల్ గ్రామంగా పరిగణించ బోతున్నట్లు కలెక్టర్ శ్రీ ఎం. పాంటశివ రావు ప్రకటించారు. సారా నిషేధానికి గ్రామస్తులు సహకరించక పోవడం, ఎంత వద్దని వారించినా ప్రజలు సారా త్రాగడంతో ఈ "గుర్తింపు" ప్రసాదించామని; అందుకు ఈ శిక్షగా మొదట అరటిని, ప్రైవేటు బస్సులను రద్దు చేస్తున్నామని; అప్పటికి దారికి రాకుంటే కరెంటు, నీళ్లు కూడా నిల్పేస్తామని హెచ్చరించారు కలెక్టర్ గారు!

సారా నిషేధాన్ని సంపూర్ణంగా అమలు జరిపించాలన్న సదుద్దేశ్యంతో సాత్వికుడైన కలెక్టర్ గారు ఈ సింహగర్జనలు చేస్తున్నట్లుంది. అయితే ఎంత సారా నిషేధం అమలైనా, కలెక్టర్‌గా ఆయనిటువంటి ప్రకటనలు చేయడం దుడుకుతనం అన్పించుకుంటుందేమో ఆలోచించాలి! ప్రజల్లో సారా దుర్వ్యసనం పట్ల వైముఖ్యం కల్గించాల్సిందే; దాన్ని పారద్రోలాల్సిందే; త్రాగేవారిలో పరివర్తన తేవాల్సిందే; నిషేధం సంపూర్ణంగా అమలుపరచాల్సిందే! కాని ఈ పేరుతో గ్రామాలను నేర ప్రదేశాలుగా గుర్తించే అధికారం వుందా? ఎవరో ఒకరు నేరం చేస్తున్నారని ఆ వూరినే శిక్షించేందుకు చట్టం సమ్మతిస్తుందా? సారా త్రాగే వారున్నంత మాత్రాన మంచి నీళ్లు, బస్సులు రద్దు చేసే అధికారం ఎవరికి, ఎవరు కల్పించ గలరు? సారా త్రాగే వారుండేది కేవలం వాటంబేడు గ్రామంలోనేనా? ఇంకెక్కడా లేరా?

> **సారా త్రాగే వారున్న వూళ్లకు నీళ్లు, బస్సులు నిల్పే అధికారం వుందా? సారా క్రిమినల్స్ పేరుతో పరువు తీసే స్వేచ్ఛ ఎవరికుంది? బ్రాందీ అమ్ముతూ సారా నేరమంటే నగుబాటు కాదా?**

నెల్లూరు టౌన్‌లో, కావలి, గూడూరు పట్టణాలలో సారా అమ్మకాలు, సేవనాలు జరగడం లేదా? వాటినీ క్రిమినల్ సిటీలుగా గుర్తించి కరెంట్ కట్ చేసేస్తారా? బస్సులాపేస్తారా?

సారా నిషేధం తప్పనే భావంతో మేమీ ప్రశ్నలు వేయడం లేదు. కాని ఆ పేరుతో అధికారులు – వ్యక్తిగతంగా వారెంత ఉత్తములు, సంస్కారవంతులు కానివ్వండి – చట్టాన్ని తమ చేతిలోకి తీసుకోవడానికి, తాము చెప్పిందే శాసనమని భావించడానికి పూనుకుంటే సారా కంటె దారుణమైన విష ఫలితాలను ప్రజలను భవించ వలసి వస్తుందనే హెచ్చరిక కోసం ఈ అభ్యంతరం చెప్తున్నాము. అసలు ప్రభుత్వం ఒక వైపు బ్రాందీ అమ్మి డబ్బు చేసుకుంటూ, ఇంకొక ప్రక్క సారా త్రాగడం నేరమనడం ఎంత నగుబాటుగా వుంది? ఆ లైసెన్సుకు పంతకం పెడుతూ, ఈ నేరానికి శిక్ష విధించవలసి రావడం కలెక్టర్ వంటి అధికారులకూ సంకటంగానే వుండి వుంటుంది. బ్రాందీ అని పేరే గాని అవి రంగు కల్పిన సారా నీళ్లే; ఇది వరకు పది రూపాయలతో పేదవాడి నిషా కోరిక తీరేది, ఇప్పుడు పాతిక రూపాయలు పెట్టి ఆ కోరిక తీర్చుకోవాలి. ఎంత నిష్ఠూరంగా కన్పించినా సారా నిషేధం పేదవాడి జేబు తస్కరించడానికి ప్రభుత్వం ఆడే

కొరవ 10 పేజీలో

# ధన్యజీవులైన మహిళలిద్దరకు కావలిలో ఘన సంస్మరణ!

కావలి నవ వికాస్, సొసైటి ఫర్ సోషల్ ఛేంజ్ సంయుక్తంగా 31 తేది ఏర్పాటు చేసిన చిత్ర పటావిష్కరణ కార్యక్రమం చరిత్ర పుటలను వెనుకకు తిప్పి ఈ గడ్డ పై పుట్టి, స్త్రీ జనోద్ధరణకు, సమాజ నిర్మాణ కార్యానికి అంకితమైన దుర్గాబాయి దేశ్ ముఖ్, పొణకా కనకమ్మల సేవా నిరతిని కార్యదక్షతను కావలియులు నెమరు వేసుకొనే అవకాశం కల్పించింది. నవ వికాస్ కార్యాలయ భవనంలో దుర్గాబాయి దేశ్ ముఖ్ చిత్ర పటాన్ని హైదరాబాద్ ఆంధ్ర మహిళా సభ అధ్యక్షురాలు శ్రీమతి సుగుణ మణి, శ్రీమతి పొణకాకనకమ్మ చిత్ర పటాన్ని మద్రాస్ ఇండస్ట్రియల్ కెమికల్స్ ఏజన్సీస్ అధినేత, మహిళ సభ కోశాధికారి శ్రీ ఏనుగు సీతారామ రెడ్డి ఆవిష్కరించారు. ఈ సభకు వుదయం దినపత్రిక ఛీఫ్ ఎడిటర్ శ్రీపాత్తూరి వెంకటేశ్వర రావు అధ్యక్షత వహించడంతో నిండుతనం చేకూరింది. దుర్గాబాయి బాల్యంలోనే నాయకత్వం లక్షణాలను పుణికిపుచ్చుకొని పండిట్ జవహర్ లాల్ నెహ్రూ అంతటి వాన్ని ప్రవేశిక లేదన్న మిషతో కాంగ్రెస్ మహాసభ జరుగుతున్న ప్రాంగణంలోనికి అడుగుపెట్టనీయలేదు. సత్యాగ్రహ వుద్యమం తరువాత కాంగ్రెస్ సత్యాగ్రహ దళాలకు నాయకత్వం వహించి, పదవి బాధ్యతలు విజయవంతంగా నిర్వహించింది. రాజకీయ అధికారాలకు ఏ రోజూ అర్రులు చాచక స్త్రీ జనోద్ధరణ కార్యక్రమాలకే అంకితమయ్యింది.

సాధారణ గృహిణియైనశ్రీమతి పొణకా కనకమ్మ, దుర్గాభాయ్ దేశ్‌ముఖ్ కన్నా రెండు దశాబ్దాలు ముందుగానే గాంధీ గారి ఆశయాలకు నెల్లూరు జిల్లాలో కార్యరూప మిచ్చారు. అనాధ విధవలైన స్త్రీల అభ్యున్నతికి పాటుపడడంతో పాటు పల్లిపాడు ఆశ్రమ పాఠశాలకు కస్తూరి దేవి విద్యాలయ స్థాపనకు కృషి చేశారు. మహిళా సభ అధ్యక్షురాలు సుగుణ మణి మాట్లాడుతూ కనకమ్మ గారు 1892 లో పుట్టారు. ఆమె శతదినోత్సవ సభలు జరుప వలసిన తరుణంలో కనీసం పటావిష్కరణైనా జరపడం ఆనందం. పొట్లపూడి వంటి కుగ్రామంలో జన్మించిన పొణకా కనకమ్మ సుజన రంజని సమాజం స్థాపించి ఆస్తిపాస్తులన్నీ పోయినా సమాజ సేవ ఆపకుండా చేపట్టి కల్లు కుండలు పగులగొట్టి సారా నిషేధానికి ఆనాడే బీజాలు వేసారు. అవి నేడు జిల్లా మహిళలకు స్ఫూర్తి అయ్యాయి. ప్రపంచ

కొరవ 10 పేజీలో



# అల్లూరు రోడ్డుకు ఆదిలోనే హంసపాదు

సమయం, సందర్భం లేకుండా మొదలెట్టిన అల్లూరు డబుల్ రోడ్డు పనులకు ఆదిలోనే హంసపాదు ఎదురయ్యేటట్లుంది. తాతల నాటికాలంలోనే పంటల అల్లూరుగా పేరు గాంచి ;తరువాత విస్తార ఉప్పు పరిశ్రమ కేంద్రంగా విలసిల్లినా రవాణా అంతా సింగిల్ రోడ్డు పైనే సాగాల్సి వచ్చింది. ఆ రోడ్డు కూడా ఎత్తు, పల్లాలతో నిండి వుండేది. అల్లూరీయులెవరూ రాజకీయ నాయకులుగా ఎదగక పోవడంతో అభివృద్ధి కూడా ఎక్కడ వేసిన గొంగళి అక్కడేనన్నట్లుండేది. ఈ దశలో అల్లూరీయుడు ఎమ్మెల్యే కావడంతో డబుల్ రోడ్డుకు కోటి రూపాయలకు పైగా నిధులు మంజూరు చేయించారు. టెండరు పూర్తయ్యి రోడ్డు వైశాల్యం ఏడు మీటర్లుగా నిర్ధారించడంతో సమస్య మొదలైంది. ఏళ్ల తరబడి రోడ్డు మార్జిన్ ఆక్రమించి పలువురు కట్టడాలు కట్టి వుండడం సమస్యగా పరిణమించింది. అది ఒక కొలిక్కి రాగానే జూన్ నెల చివరి వారంలో పనులు మొదలెట్టిన కాంట్రాక్టర్లు జూలై నెలలో రాజుపాళెం నుంచి ఇస్కపల్లి వరకున్నతూములను కూల్చేశారు. అత్యంత పటిష్టంగా ఎప్పుడో బ్రిటిష్ వాళ్ల కాలం నాటి వాటిని కూల్చను వారు పడిన పాట్లు వర్ణింప తరం కాదు. అదే విధంగా పైడేరు కాల్వ వద్ద నుండి బీరంగుంట వద్ద వరకు రోడ్డును తిరగ గొట్టి పక్క పొలాల్లోని చవిటి మట్టితో కప్పి ఎత్తు చేశారు. గతవారంలో చినుకులు పడడం తో ఆ రోడ్డంతా రొచ్చయి బస్సులు కూరుకుపోయి డ్రైవర్లు నానా తంటాలు పడ్డారు. అయితే ఇంకా, రోడ్డుకు రెండు పక్కల వున్న చెట్లు నరకలేదు. ఇరు వైపులా కొత్త రోడ్డును సమం చేసే పని చేపట్టలేదు. డివైడర్ల వద్ద మాత్రం ఎర్రమట్టి తోలి పూరుకొన్నారు. సెప్టెంబర్, అక్టోబర్ మాసాలకు గాని ఈ పని మొదలెట్టేట్లు లేదు. అప్పటి వర్షాలకు పని అర్ధాంతరంగా ఆగిపోవడం ఖాయం. దీనివల్ల డబుల్ రోడ్డు పని వికటించక తప్పదు. ఈ విషయన్నీ అధికారులు, రాజకీయ నాయకులు దృష్టిలో వుంచుకొని వర్షాకాల సీజన్ పోయిన తరువాత పనులు మొదలు పెడితే బాగుంటుందేమో?

## పేలుడు పదార్థాల స్వాధీనం

చిట్వేలి ఎన్‌కౌంటర్ తర్వాత జిల్లాలో నక్సలైట్ సానుభూతి పరులున్న రాపూరు మండలం లోని కొన్ని గ్రామాల పై పోలీసుల కళ్లు పడ్డాయి. గరిమెన పెంట గ్రామ అరుంధతీయ వాడలో పెంచల కోన సభ్యుడు జి. ఈశ్వరయ్య కోసం వెతుకుతుంటే జి. శివయ్య అనే ఒక వ్యక్తి ప్రేలుడు పదార్థాల సంచితో దొరికాడని పోలీసులు వర్గాలు తెలుపుతున్నాయి.


జమీన్‌రైతు

సంవత్సర చందా రు 100/-

6 నెలలకు - రు. 50/-

# అంతటి స్నేహశీలి
# మా కింక దొరకడు !



మా హరిజన విద్యార్థి ఉద్ధారక సంఘానికి తన స్నేహ హస్తాన్నందించి,
సహకరించిన మాన్యులు మా అందరి అభ్యున్నతి కాంక్షించిన సహృదయులు,

## శ్రీ నెల్లూరు శ్రీరామమూర్తి గారు

దివికేగడంతో మాకీ లోకం గాఢాంధకారంగా కన్పిస్తూంది

అంతటి స్నేహశీలిని పొందడం మాకింక దుర్లభం

వారికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి

నేదురుమల్లి పద్మనాభరెడ్డి
అధ్యక్షుడు

పట్రా ప్రకాశరావు
కార్యదర్శి

## హరిజన విద్యార్థి ఉద్ధారక సంఘము

వాకాడు, నెల్లూరు జిల్లా

## నెల్లూరు నలుచెర్గుల్లో విశేషములు

### జనార్దన రెడ్డి

స్వర్గీయ బాలకృష్ణారెడ్డి గారి కుమారుడు భాస్కర్ అంత్యక్రియలలో పాల్గొనడానికి మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి ఈ రోజు (6 తేది) వాకాడు వచ్చారు. రెండు రోజుల పాటు వుంటారు.

### వావిలాల పర్యటన

రాష్ట్ర సారా నిషేధ ప్రచార కమిటీ అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య 5 తేది నెల్లూరు వచ్చారు. నెల్లూరులో అధికార, అనధికారులతో సమావేశాలు జరపడంతో పాటు దూబగుంట, ఇందుకూరుపేట, రాపూరు తదితర గ్రామాలలో పర్యటిస్తున్నారు. ప్రజలను నేరుగా కలిసి సారా నిషేధం పై వారి ప్రతి స్పందన, దాని అమలు తీరును అధ్యయనం చేయడం గోపాలకృష్ణయ్య గారి పర్యటనోద్దేశ్యం. కమిటీ సభ్యుడు, మాజీ పార్లమెంట్ సభ్యుడు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కూడా ఆయన వెంట నెల్లూరు వచ్చారు.

కేవలం ప్రభుత్వ నిషేధంతో ఈ దుర్వ్యసనం రూపు మాసిపోదని, సారాయికి వ్యతిరేకంగా ఏ రీతిలో ఉద్యమం చేపట్టారో అంతే చిత్తశుద్ధితో నిషేధం అమలుకూ ఉద్యమం నడిపితే తప్ప పరివర్తన సాధ్యం కాదని అన్నారాయన.

### వ్యాపారాల బంద్

టర్నోవర్ ట్యాక్సుకు నిరసనగా ఈ వారంలో రెండవ సారి 5 తేది జిల్లాలోని వ్యాపారు లందరూ బంద్ పాటించారు. మధ్యాహ్నం వరకు ఒక్క అంగడి తెరువలేదు. చిన్న బజారు, స్టోన్‌హౌస్‌పేట వంటి రద్దీ ప్రాంతాలూ వెలవెల పోయాయి. మందులంగళ్లను మాత్రం కొద్ది మేర బంద్ నుంచి మినహాయించడంతో అవి పనిచేశాయి. బంగారు, ఫ్యాన్సీ, చిల్లరంగళ్ల వంటి వన్నీ మూతపడ్డాయి.

### వాకాడు భాస్కర్ దుర్మరణం

వాకాడు విద్యానగర్ విద్యా సంస్థల జనకుడు స్వర్గీయ నేదురుమల్లి



విజయభాస్కర రెడ్డి 5 వ తేది రాత్రి దుర్మరణం పాలైనాడు. పసివయసు, జీవితం పై ఎందుకు విరక్తి కల్గిందో పాపం!

భాస్కర్ తన తండ్రి మరణానంతరం వాకాడు హాస్టళ్లను కొంత కాలం నిర్వహించారు. ఆర్థిక కారణాలతో ఆ తర్వాత అవి మూతబడ్డాయి. అప్పటి నుంచి ఏ వ్యాపకమూ లేదు. స్థానిక హై స్కూలుకు కరస్పాండెంట్‌గా వున్నారు. 40 ఏళ్ల వయస్సుంటుంది; భార్య, ఇద్దరు చిన్న పిల్లలున్నారు.

కొరవ 10 పేజీలో

## పెల్లేటి గోపాలకృష్ణా రెడ్డి మృతి

మాజీ శాసనసభ్యుడు, క్రైస్తవ జాతీయవాది, వదాన్యుడు శ్రీ పెల్లేటి గోపాలకృష్ణా రెడ్డి 4 తేది హైదరాబాద్‌లో మరణించారు. ఆయన వయస్సు 78 సంవత్సరాలు.

జిల్లాలో అత్యంత సంపన్న భూస్వామ్య కుటుంబాలలో శ్రీ పెల్లేటి గోపాలకృష్ణా రెడ్డి గారి దొకటిగా వుండేది. వారి స్వగ్రామం పెద్దపరియ. గూడూరు డివిజన్ రాజకీయాలలో చాలా కాలం ప్రధాన పాత్ర వహించారు. రెండు పార్లు ఎమ్మెల్యేగా ఎన్నికైనారు. తొలుత నుంచి కాంగ్రెస్ వాది. ఏసిసి కార్యవర్గ సభ్యుడు కూడా పనిచేశారు.

గోపాలకృష్ణా రెడ్డి గారు వదాన్యులు. ఆచార్య వినోబా బావే భూదానోద్యమ సమయంలో స్వచ్ఛందంగా 300 ఎకరాల భూమి దానం చేశారు. పెద్ద పరియలో



పూర్వీకులు తనకిచ్చిన ప్యాలెస్ వంటి తన ఇంటిని ఆస్పత్రికి విరాళంగా ఇచ్చారు. కోటలోని మహిళా జూనియర్ కాలేజి దాతలలో ఆయన ప్రధానుడు. జిల్లాలో 53 దేవాలయాలను తన స్వంత ఖర్చుతో జీర్ణోద్ధరణ చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి సభ్యుడుగా పనిచేశారు. అమెరికాలోని న్యూయార్క్‌లో నిర్మించిన శ్రీ వెంకటేశ్వర స్వామి దేవాలయ నిర్మాణ కమిటీలోనూ ఆయన సభ్యుడుగా వుండినారు. పెంచలకోన దేవస్థానం ట్రస్ట్ బోర్డు చైర్మన్‌గా వ్యవహరించారు. హైదరాబాదులోని బృందావన్ హోటల్ ఆయనదే. దాదాపు ఇరవయ్యేళ్ల నుంచి రాజకీయాలకు దూరంగా వైదొలగి ప్రశాంతంగా కాలం గడుపుతుండినారు.

గోపాలకృష్ణారెడ్డి గారికి ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు. పల్లపరెడ్లకు సన్నిహిత బంధువు. వారి కుటుంబానికి మా సానుభూతి.

## కృష్ణానది బస్ ప్రమాదంలో నెల్లూరు దంపతుల దుర్మరణం!

మహబూబ్ నగర్, బీచుపల్లి వద్ద 2 తేది జరిగిన ఆర్‌టిసి బస్ ప్రమాదంలో ఒక నెల్లూరు జంట



దుర్మరణం పాలైంది. రోడ్డు బ్రిడ్జిని ఢీకొని ప్రమాదవశాత్తు కృష్ణానదిలో మునిగిపోయిన ఆర్‌టిసి బస్‌లో నెల్లూరు పొదలకూరు రోడ్డుకు చెందిన శ్రీమతి దామెర్ల నాగమణి; ఆమె భర్త, కడప హౌసింగ్ కార్పొరేషన్ జిల్లా మేనేజర్ శ్రీ డి. ప్రసాద రావు మృతిచెందారు. శ్రీమతి నాగమణి పొదలకూరు రోడ్డులోని పద్మావతి హై స్కూలు కరస్పాండెంట్, ప్రధానోపాధ్యాయురాలు. హైదరాబాద్‌లో ఒక పెళ్లికి హాజరై, భర్త తోటి కడపకు వెళ్లి, కొద్ది రోజులుండి తిరిగి నెల్లూరు రావాలని ఆమె బస్సులో బయల్దేరిందట. దారిలో మృత్యువు ఆ జంటను కబళించింది.

ఈ రోజు (6 తేది) రాత్రి వరకు ఆమె శవం కూడా లభించలేదు. ఆమె భర్త శ్రీ ప్రసాదరావు శవాన్ని మాత్రం ఆర్‌టిసి బస్సులో నెల్లూరు చేర్చారు. ఆయన శవం బస్‌కు సిలభై ఐదు కిలోమీటర్ల దూరంలో వడ్డుకు చేరిందట. కిటికీలో నుంచి ప్రవాహంలోకి జారి, క్రిందకు కొట్టుకుపోయి మూడు రోజుల తర్వాత వడ్డుకు చేరింది. పాపం!

శ్రీమతి నాగమణి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం సినెట్ సభ్యురాలు; మునిసిపల్ డైరక్టర్‌గా రిటైరైన ఐఏఎస్ అధికారి, ప్రస్తుత ఆం.ప్ర.సర్వీసు కమీషన్ సభ్యుడు శ్రీ ఎన్. వెంకటస్వామి మరదలు. ఆమె అక్క — శ్రీమతి దామెర్ల సరస్వతి మెడికల్ శాఖలో అడిషనల్ డైరక్టర్‌గా హైదరాబాద్‌లో పనిచేస్తున్నారు. శ్రీమతి నాగమణి దంపతులకు ఇంజనీరింగ్ చదివే కుమారుడు, ఒక కుమార్తె వున్నారు.

మృత్యువు ఏ రూపంలో ఏ సమయంలో ఎవ్వర్ని కాటేస్తుందో వూహించటం ఎవరి తరం?

26054 (Off),

# KORA

## INSTITUTE OF ENGINEERING/ MEDICAL ENTRANCE COACHING

TEKKEMITTA, **NELLORE**-524 003.

**HEARTY CONGRATULATIONS TO OUR SUCCESSFUL STUDENTS**

# MEDICAL

| Rajesh Reddy. C | Goutham. E. | Madhumathi. G. | Krishnamraju.K.V. | Vijayanadh.O. | Jayasimha Reddy. P. | Punnaiah Chowdary |
|---|---|---|---|---|---|---|
| H.T. No. 123486 **RANK 2** | H.T. No. 126963 **RANK 8** | H.T. No. 101817 **RANK 9** | H.T. No. 127139 **RANK 13** | H.T. No. 123196 **RANK 30** | H.T.No. 165407 **RANK 41** | H.T.No. 123579 **RANK 51** |
| **Satya Aarthi.D** | **Lalitha Madhavi.A** | **Vikram Reddy. V** | **Revathi. A.** | **Hari Sankar. A** | **Vamsi Krishna. A** | **Phani Krishna. R** |
| H.T.No. 126743 **RANK 53** | H.T.No. 125880 **RANK 57** | H.T. No. 101816 **RANK 58** | H.T. No. 126775 **RANK 67** | H.T. No. 122373 **RANK 69** | H.T. No. 126802 **RANK 69** | H.T. No. 126248 **RANK 71** |
| **Anuradha. K** | **Laxmi Soujanya. U** | **Harinadh Reddy. Y** | **Naga Suresh. AL** | **Tulasi. K** | **Sridevi. V** | **Sri Latha.V** |
| H.T.No. 144043 **RANK 76** | H.T. No. 127357 **RANK 86** | H.T. No. 123355 **RANK 90** | H.T. No. 144147 **RANK 93** | H.T. No. 130627 **RANK 97** | H.T. No. 107449 **RANK 99** | H.T. No.125061 **RANK 113** |

| S.No. | NAME | H.T.No. | RANK |
|---|---|---|---|
| 22 | Jyothi Prasanna. K. | 127392 | 115 |
| 23 | Satya Prakash. M.V.S. | 126561 | 118 |
| 24 | Rama Krishna Raju | 122743 | 128 |
| 25 | Mahalakshmi. G. | 143026 | 132 |
| 26 | Sridhar. K | 123519 | 135 |
| 27 | Sunitha. K | 165036 | 140 |
| 28 | Salmon Priyadarsini. J | 131076 | 145 |
| 29 | Venkat Krishna. B | 126554 | 147 |
| 30 | Jagan Mohan Reddy. DY | 127426 | 148 |
| 31 | Lakshmi Suneetha. K | 122740 | 157 |
| 32 | Madhavi. G | 100061 | 171 |
| 33 | Seetha Rama Prasad. Y | 127229 | 188 |
| 34 | Vikram.K | 126611 | 194 |
| 35 | Syamalamma. M | 123593 | 233 |
| 36 | Katyayani. D | 135950 | 244 |
| 37 | Krishna Kishore. G | 123386 | 246 |
| 38 | Srinivasulu. M | 122405 | 247 |
| 39 | Madhavi Latha. S | 126555 | 260 |
| 40 | Muzakir Ahmed. SK | 126160 | 261 |
| 41 | Mahendra Reddy. B | 100894 | 266 |
| 42 | Pavan Kumar Reddy. G | 131902 | 268 |
| 43 | Neeraja | 125693 | 280 |
| 44 | Sowjanya. B | 123235 | 280 |
| 45 | Sireesha Rani. M | 110750 | 281 |
| 46 | Seema Agarwal. C | 126235 | 290 |
| 47 | Umamaheswara Rao. G | 123600 | 290 |
| 48 | Somasekhar.R | 126504 | 290 |
| 49 | Pranathi. S | 127247 | 294 |
| 50 | Neelima. C | 126370 | 295 |
| 51 | Venkateswar. G | 127794 | 304 |
| 52 | Bala Bhaskar Reddy. G | 125927 | 304 |
| 53 | Sudha Rani. J | 126863 | 317 |
| 54 | Satish Chandra. A | 122741 | 320 |
| 55 | Lalitha Priya. J | 103173 | 324 |
| 56 | Shalini. T | 100925 | 330 |
| 57 | Chandrakala. K | 110304 | 330 |
| 58 | Hemanth. K.V | 150162 | 345 |
| 59 | Neelima. V | 126421 | 349 |
| 60 | Vijay. B | 111574 | 354 |
| 61 | Sarath Babu. T | 127475 | 366 |
| 62 | Sathish Kumar. A | 123585 | 369 |
| 63 | Imtiaz Ali. SK | 126425 | 369 |
| 64 | Sreenivas. V | 126710 | 369 |
| 65 | Ajitha. P | 122586 | 371 |
| 66 | Rajendra Babu. AB | 126433 | 372 |
| 67 | Himabindu. C | 121204 | 383 |
| 68 | Srinivas. V | 125528 | 395 |
| 69 | Jaya Mahesh. K | 122465 | 402 |
| 70 | Siva Prasad. GV | 123320 | 407 |
| 71 | Sreelakshmi C | 126642 | 419 |
| 72 | Surekha. KV | 125136 | 429 |
| 73 | Padmaja. D | 127317 | 441 |
| 74 | Srilatha. A | 127592 | 443 |
| 75 | Bhavani Sankar. G | 125695 | 452 |
| 76 | Prameela. K | 126211 | 475 |
| 77 | Sreekanth. K | 125084 | 481 |
| 78 | Jaya Prakash. G | 123598 | 498 |
| 79 | Saroja. V | 126574 | 498 |
| 80 | Karimuddin. K.S. | 126216 | 499 |
| 81 | Chandra Sekhar. M | 127125 | 509 |
| 82 | Yacob. M | 127532 | 527 |
| 83 | Chitra. C | 128586 | 538 |
| 84 | Mythili. P | 121517 | 554 |
| 85 | Geetha. B | 127371 | 555 |
| 86 | Nagaraju. A | 126737 | 562 |
| 87 | Sriram. V | 123504 | 567 |
| 88 | Randheer Reddy. T | 127232 | 572 |
| 89 | Krishna. B | 123487 | 576 |
| 90 | Sailendra. V | 131107 | 594 |
| 91 | Krishna Reddy. G | 110524 | 603 |
| 92 | Khadervali.D | 135467 | 603 |
| 93 | Raghuveer. M | 145048 | 403 |
| 94 | Bhaktavatsala Reddy. C | 125845 | 603 |
| 95 | Ram Mohan Rao. V | 126205 | 611 |
| 96 | Riazuddin. M | 127257 | 611 |
| 97 | Sandhya Rani. N | 102071 | 613 |
| 98 | Sujana Kumar. K | 121240 | 623 |
| 99 | Ram Kumar. M | 123367 | 635 |
| 100 | Rama Kanth. D | 102039 | 638 |
| 101 | Rajender Reddy. B | 125144 | 645 |
| 102 | Rama Chandra Rao. V | 126749 | 645 |
| 103 | Jayakrishna. S | 112026 | 655 |
| 104 | Naveen Kumar. B | 127331 | 673 |
| 105 | Sathish. S | 125766 | 686 |
| 106 | Neeraja. P | 126195 | 696 |

# ENGINEERING

| Gangadhar. KNB | M. Ravi Kumar | Srinivasa Rao. A | Mahesh. MN | Suman Babu |
|---|---|---|---|---|
| H.T.No. 35639 **RANK 26** | H.T. No. 14004 **RANK 32** | H.T. No. 36548 **RANK 33** | H.T. No. 31855 **RANK 57** | H.T. No. 35426 **RANK 62** |

| S.No. | NAME | H.T.No. | RANK |
|---|---|---|---|
| 6 | Hussian. SB | 53342 | 170 |
| 7 | Surendranath. GNP | 37339 | 175 |
| 8 | Suresh Babu. M | 36077 | 181 |
| 9 | Rajaram Reddy. N | 33153 | 186 |
| 10 | Kiran Kumar. D | 35189 | 187 |
| 11 | Krishna Kishore. K | 34017 | 190 |
| 12 | Narasimha Rao. KP | 35042 | 226 |
| 13 | Seetha Lakshmi. G | 33473 | 243 |
| 14 | Saroja. U | 41750 | 248 |
| 15 | Vijaya Reddy. R | 36830 | 250 |
| 16 | Santhosh Kumar. P | 57614 | 262 |
| 17 | Rajesh. M | 30127 | 272 |
| 18 | Surendranath Reddy. GB | 36113 | 290 |
| 19 | Narasimha Reddy. AV | 30176 | 292 |
| 20 | Kanthi Kiran. P | 40743 | 334 |
| 21 | Anil Kumar. P | 75150 | 348 |
| 22 | Muzaiuddin. SK | 35107 | 375 |
| 23 | Aravinda Babu. D | 53510 | 417 |
| 24 | Raja Chowdary. T | 36966 | 457 |
| 25 | Santha. NV | 38076 | 467 |
| 26 | Naveen Kumar. G | 33164 | 475 |
| 27 | Kiran. CR | 37031 | 531 |
| 28 | Ravindar Reddy. R | 40381 | 543 |
| 29 | Guru Prasad. KV | 35129 | 601 |
| 30 | Lakshmi Narasimha. SMN | 45058 | 603 |
| 31 | Vamsidhar. S | 33837 | 670 |
| 32 | Muni Praveen Kumar. K | 34664 | 676 |
| 33 | Vidyadhar Reddy. G | 34258 | 739 |
| 34 | Pavan Kumar. S | 35829 | 777 |
| 35 | Naseer Pasha. A.MD | 41741 | 804 |
| 36 | Kumar. BBC | 36594 | 888 |
| 37 | Sridhar. P | 61239 | 900 |
| 38 | Praveen Kumar. S | 37143 | 908 |
| 39 | Aravinda Babu. NR | 30990 | 947 |
| 40 | Srinivasa Reddy. I | 35270 | 970 |
| 41 | Satya Kumar. B | 36919 | 971 |
| 42 | Siva Prasad. B | 10306 | 1033 |
| 43 | Vijaya Sai. K | 32081 | 1044 |
| 44 | Sumatha. BP | 36920 | 1094 |
| 45 | Bhaskara Rao.G | 37543 | 1116 |
| 46 | Chaitanya Krishna. P | 30402 | 1156 |
| 47 | Kishore Sarma. BN | 12911 | 1194 |
| 48 | Vasudev. P | 37953 | 1198 |
| 49 | Upendra. M | 31773 | 1266 |
| 50 | Balarama Reddy. T | 30022 | 1268 |
| 51 | Suresh Babu. V | 35760 | 1272 |
| 52 | Ravi. C | 30736 | 1281 |
| 53 | Krishna Murthy. R | 3069 | 1316 |
| 54 | Vijaya Sankar. D | 37587 | 1379 |
| 55 | Haseena. SK | 37728 | 1408 |
| 56 | Madhavi Satyasu | 64218 | 1409 |
| 57 | Vinod Kumar. K | 36285 | 1438 |
| 58 | Srinivas. RN | 81179 | 1480 |
| 59 | Ramesh Chandra. M | 32631 | 1510 |
| 60 | Hanumantha Rao. T | 73766 | 1526 |
| 61 | Jaya Prakash. R | 37982 | 1528 |
| 62 | Penchala Prasad. K | 37295 | 1541 |
| 63 | Sudheer Reddy. I | 33891 | 1552 |
| 64 | Krishna Kumar. E | 31449 | 1566 |
| 65 | Krishna Charan Prasad. P | 35801 | 1612 |
| 66 | Srinivas. CH | 36289 | 1743 |
| 67 | Suresh Kumar. BV | 37505 | 1753 |
| 68 | Veeranjaneyulu. B | 36816 | 1790 |
| 69 | Suresh. V | 32481 | 1813 |
| 70 | Sumanth Kumar. K | 37788 | 1858 |
| 71 | Mahesh. E | 32653 | 1943 |
| 72 | Srinivasa Murthy. MV | 37715 | 1979 |
| 73 | Sri Raghuram. C | 36756 | 2008 |
| 74 | Suchitra. M | 36631 | 2070 |
| 75 | Surendra Babu. P | 28051 | 2092 |
| 76 | Harendar. K | 59085 | 2121 |
| 77 | Madhavi. DV | 32796 | 2153 |
| 78 | Varaprasad.PS | 61253 | 2179 |
| 79 | Srinivasa Reddy. S | 37340 | 2258 |
| 80 | Dharani Kumar. KN | 31975 | 2383 |
| 81 | Suresh Kumar Reddy. K | 34257 | 2474 |
| 82 | Murthy. KVR. CH | 37060 | 2493 |
| 83 | Raghunath Kumar. K | 36272 | 2551 |
| 84 | Ramesh. D | 31856 | 2557 |
| 85 | Srinivas Goud. M | 36549 | 2565 |
| 86 | Sunilkumar Reddy. K | 36879 | 2590 |
| 87 | Kishore. K | 37431 | 2716 |
| 88 | Kasiviswanatha Reddy. K | 37437 | 2738 |
| 89 | Sunanda. PO | 34222 | 2767 |
| 90 | Nagarjun. K | 36857 | 2796 |
| 91 | Siva Kumar. TS | 36101 | 2815 |
| 92 | Srikanth. V | 35837 | 2889 |
| 93 | Krishna Reddy. NSR | 77794 | 2911 |
| 94 | Narasa Reddy Swaroop. V | 37966 | 2989 |
| 95 | Rahul. PP | 35615 | 2989 |

**THIS LIST IS EXCLUSIVE OF S.T., S.C., B.C., AND OTHER RESERVATIONS**

**OUR LONG TERM & INTENSIVE COACHING BATCHES COMMENCE IN THE FIRST WEEK OF SEPTEMBER, 1993**

**For application Form & Prospectus Send Rs. 40/- by M.O. only**

## నెల్లూరు ముచ్చట్లు

(7 పేజీ తరువాయి)

వారి కుటుంబానికి మా సానుభూతి.

### లారీల బంద్

లారీల బంద్ కొనసాగుతూనే వుంది. వెంకటేశ్వర పురం, అయ్యప్ప గుడి సెంటర్‌లలో అసోసియేషన్ సభ్యులు గుడారాలు వేసుకొని కూర్చుని పైనే హర ఒక్క లారీ కూడా తిరగకుండా కాపలా కాస్తున్నారు. నెల్లూరులో వున్న సుమారు 15 వేల లారీలు ఎక్కడి వక్కడ నిల్చిపోయాయి. పెట్రోలు, డీసలు, వంట గ్యాస్ లారీలను మాత్రం అనుమతిస్తున్నారు. అందువల్ల మొదట ఒకటి రెండు రోజులు తప్ప వాటికి కొరత ఏర్పడలేదు. కూరగాయలకు మాత్రం కటకటగా వుంది. రోజు రోజుకూ ధరలు పెరిగి పోతున్నాయి. పెక్కు వ్యాపార సంస్థలు, పరిశ్రమలు మూతపడే పరిస్థితికి చేరుకొంటున్నాయి. వచ్చే వస్తువు లేదు, పోయే వస్తువూ లేదు. పరిశ్రమలు ఎంత కాలం నడుస్తాయి? బంద్ మరొక వారం గనుక జరిగితే ప్రజా జీవితం స్తంభించి పోతుంది.

ఎస్‌పి శ్రీ కృష్ణప్రసాద్ గారు నిత్యావసర వస్తువులకు కొరత ఏర్పడకుండా జిల్లా సరిహద్దులన్నిటి దగ్గరా పోలీసు దళాలను నియమించారు. పెట్రోలు, కూరగాయలు, ఇతర అత్యవసర వస్తువులు తెచ్చే లారీలకు వారు బందో బస్తు ఏర్పాటు చేసి, ఆందోళన కారుల నుంచి సమస్య లేకుండా నడిపిస్తారు. కానీ మద్రాసు నుంచే లారీలు కదలనందు వల్ల ఈ పోలీసు బందోబస్తును వుపయోగ పెట్టుకునే లారీల సంఖ్య చాలా తక్కువగా వుంది. జాతీయ రహదారి పైన వాహనాల రాకపోకలే లేవు. బోసి పోయి వున్నది హైవే. లారీలు తిరగడం లేదు కాబట్టి, రోడ్డు ప్రమాదాలూ లేవు.

### తుర్లపాటికి చిన్న బాధ్యత

ఆంధ్రజ్యోతి దిన పత్రిక సంపాదక వర్గ సభ్యుడు; జర్నలిస్టుగా, అసాధారణ వక్తగా ఆంధ్రదేశానికంతటికీ సుపరిచితుడైన వుత్సాహి శ్రీ తుర్లపాటి కుటుంబరావుకు ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు ఒక చిన్న బాధ్యత అప్పచెప్పారు. భారత ప్రభుత్వం నిర్మించనున్న ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశం పంతులు డాక్యుమెంటరీకి ఆయన్ను - సలహాదారుడుగా నియమించారు. అన్ని భాషలలో విడుదలయ్యే డాక్యుమెంటరీ ఇది. తుర్లపాటి, స్వర్గీయ ఆంధ్రకేసరికి కొంత కాలం ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. ఆ రూపంలో ఆ మహానుభావుడితో సన్నిహిత సంబంధం వుంది.

### లాయర్లకు ఎస్‌పి విజ్ఞప్తి

నెల్లూరు జిల్లాలో దోపిడీలు లూటీలకు పాల్పడుతున్న క్రిమినల్ గ్యాంగ్‌లను అణచి వేయడంలో సహకరించ వలసిందిగా నెల్లూరు లాయర్లకు ఎస్‌పి శ్రీ కృష్ణప్రసాద్ ప్రత్యేక విజ్ఞప్తి చేస్తున్నారు.

కావలిలో భీతావహం సృష్టించిన రౌడీ - కర్రెద్దుల జయపాల్ హత్యకేసులో యావజ్జీవ ఖైదు శిక్ష పడిన పిట్ల సుధాకర్ అనే మాజీ కానిస్టేబుల్ ఒక ముఠాను తయారు చేసి జిల్లాలో, బయట కూడా పలు దోపిడీలకు పాల్పడ్డాడట. అతన్ని, అతని ముఠాలోని గొర్లెటి వెంకటేశ్వర్లు అనే మరొక బందిపోటును పోలీసులు అతి కష్టం మీద పట్టుకున్నారట. అయితే కోర్టులో వెంకటేశ్వర్లుకు వెంటనే బెయిల్ ఇప్పించారట నెల్లూరు లాయర్లు ఇద్దరు. క్రిమినల్ గ్యాంగ్‌లలో సభ్యులైన వారిని పట్టుకోవడం ఎంతో ప్రయాసతో కూడిన, ఒక్కొక్కసారి ప్రాణాపాయం కల్గించే పనని తెలిసీ లాయర్లు వారిని సులభంగా విడిపించి వేస్తే దోపిడీలు అరి కట్టడం అసాధ్యమౌతుందని, న్యాయవాదులు తమ బాధను సహృదయంతో అర్థం చేసుకొని సహకరించాలని కోరుతున్నారు ఎస్‌పి గారు! దోపిడీ కేసుల్లో నిందితుల తరఫున వాదించ వద్దని విజ్ఞప్తి చేస్తున్నారు.

### చిన్మయానందస్వామి నిర్యాణం

పరమ పూజ్యులు, అంతర్జాతీయ స్థాయిలో చిన్మయా మిషన్ స్థాపించి



భారత ఆధ్యాత్మిక చింతనను ప్రచారం చేస్తున్న వేదాంతి శ్రీ స్వామి చిన్మయానంద అమెరికాలో హృద్రోగంతో మరణించారు. చిన్మయానంద స్వామి భగవద్గీత ఉపనిషత్తుల పై ప్రసంగిస్తుంటే శ్రోతలు మంత్రముగ్ధులై వినేవారు. అనేక ఆధ్యాత్మిక గ్రంథాలు రచించారు. ఆయనకు కొన్ని లక్షల మంది శిష్య గణం వున్నారు. విద్య, వైద్యాలయా లెన్నింటినో స్థాపించి, ఆదర్శప్రాయంగా నిర్వహించారు.

ఆయన స్మారకార్థం 8 తేది నెల్లూరు సాయిమందిర ప్రాంగణంలో పేదలకు అన్నదానం జరుగుతుందని నెల్లూరు చిన్మయానంద మిషన్ అధ్యక్షుడు శ్రీ కొండా బలరామ రెడ్డి తెలియజేస్తున్నారు.

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| బంగారు సవర (8 గ్రా) | 3,520/- |
| వెండి (10 గ్రా) | 70/- |
| వేరుశెనగనూనె (కేజి) | 35/- |
| మిరపకాయలు (కేజి) | 20/- |
| చింతపండు (కేజి) | 24/- |
| చక్కెర (కేజి) | 11/- |
| బెల్లం (కేజి) | 16/- |
| కందిపప్పు (కేజి) | 19/- |
| పెసరపప్పు (కేజి) | 17/- |
| మినపపప్పు (కేజి) | 12/- |

### సణుగుడు

(2 పేజీ తరువాయి)

ఇప్పటికిప్పుడు రాజీ చేసుకోవలసిన అగత్యం లేదని; సంజీవ రెడ్డి క్షమాపణ చెప్పే పనైతే ఇందిరా భవన్‌లో కాంగ్రెస్ కార్యకర్తల సభ పెట్టి జనార్దన రెడ్డి సమక్షంలో తాను చేసినవి నిందలే తప్ప నిజాలు కావని వినయంగా చెప్పడం సబబని; అంత వరకు ఎవరి మానాన వారుంటడమే గౌరవమని సుబ్బరామ రెడ్డి గారి భావన. జనార్దన రెడ్డి గారు ఈ రెండు శక్తులనూ కలిపి, జిల్లా కాంగ్రెస్‌లో స్పర్థలు మాన్పి, పార్టీని ఏకోన్ముఖంగా నడిపించాలనే సదుద్దేశ్యంతో సంజీవ రెడ్డిని ఒప్పించి రాజీ మార్గానికి తెచ్చారు. అవతలి వారి అభిప్రాయాలు తెలుసు కోకుండా తొందర పడడంతో ఆ యత్నం విఫలమైంది. విచారకరమిది!

కాంగ్రెస్ పార్టీ ఇప్పుడున్న పరిస్థితులలో ఏ ఇద్దరూ ఎడమొగం, పెడమొగంగా వుండడం మంచిది కాదు. అందులోనూ వీరిద్దరూ పార్టీలో ప్రబలమైన వ్యక్తులు. రెండు కుంపట్లు వెలిగిస్తే నష్టపోయేది పార్టీ మాత్రమే.

### జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

నాటకంగా కప్పిస్తున్నదన్నమాట అక్షరాలా నిజం. చిత్తశుద్ధి లేని ఇటువంటి సర్కారు శివపూజల విషయంలో కలెక్టర్ గారు అంత దురుకుగా వ్యవహరించ వలసిన అవసరం వుంటుందనుకోలేము.

సారా క్రిమినల్స్ గుర్తింపు, సంఘ బహిష్కారం, గ్రామాల సౌకర్యాలకు అంతరాయం వంటి చర్యలు సారా ఉద్యమ కార్యకర్తల చేత జరిపిస్తే అందరూ సంతోషిస్తారు. ప్రజల హక్కులకు భంగం కల్గకుండా దుర్వ్యసనాల నివారణకు ప్రజా ఉద్యమాలు నడపడం అభినందనీయం, అనుసరణీయం. సారా క్రిమినల్స్ పేరుతో కలెక్టర్ గారు కొన్ని పేర్లు పత్రికలకు విడుదల చేశారు. అదీ మంచి పద్ధతి కాదు. ఒక అధికారిగా తప్పు చేసిన వారిని శిక్షించేందుకు చట్టంలోని మార్గాలను ఎన్నుకోవాలి కాని, ఏ న్యాయస్థానం, లేదా దర్యాప్తు సంస్థ నేరం నిర్ధారణ చేయకుండా ప్రజల వ్యక్తిగత పరువు తీసే ప్రకటనలు చేసే స్వేచ్ఛ ఎవరిచ్చారు? ఈ ప్రకటననూ సారా ఉద్యమ సంస్థలు విడుదల చేయడమే సమంజసం. తప్పు. కలెక్టర్ హోదాలో చేయడం - ఆయనకు బాధ కల్గించినా - తప్పే! సాంబశివ రావు గారు ఆలోచించాలి!

### ఘన సంస్మరణ

(5 పేజీ తరువాయి)

చరిత్రలో పేరు గాంచారన్నారామె. సభలో శ్రీ రావులపాటి సీతారామారావు, జానమద్ది హనుమచ్ఛాస్త్రి, డాక్టర్ విజయం, ఎల్.వి. కృష్ణారెడ్డి పాల్గొని దుర్గాబాయి, కనకమ్మలు జాతిమాణిక్యాలని శ్లాఘించారు.

### లోక సంస్కృతి?

— గ్రావ్యశ్రీ

మత్స్యపు చిప్పలోనూ
వర్షపు చుక్కలోనూ
స్వచ్ఛత లోపిస్తోంది
చిలకా గోరింకల అప్యాయతలోనూ
కోయిల కూ.. కూ... రాగంలోనూ
అస్పష్టత కన్పిస్తోంది
పురివిప్పి నృత్యం చేసే నెమలి
శాంతి సందేశ సూచిక కపోతమూ
వికటాట్టహాసాలతో
కర్కశ కరాళ నృత్యాలు చేస్తున్నాయ్
పాలను వదలి హంసలు మురికి నీటికై
అశుద్ధాని వదలి పిపీలికాలు
పంచభక్ష్య పరమాన్నాలకై
పరుగులు తీస్తున్నాయ్
అభిమానం, అనురాగం
అప్యాయత, ఆదరణ
చూపాల్సిన లోక సంస్కృతి
తన ఉనికినే కోల్పోతోంది!

### రాపూరు పోలీసు క్వార్టర్ల ప్రారంభం

రాపూరులో నూతనంగా నిర్మించిన పోలీస్ క్వార్టర్లను ఎస్.పి. శ్రీ కె. కృష్ణ ప్రసాద్ 1 తేది ప్రారంభించారు, అనంతరం విలేఖరులతో మాట్లాడుతూ ప్రపంచంలో మరెక్కడా లేని ఎర్ర చందనపు వృక్షాలు కలిగి వున్న ఘనత రాపూరుకే దక్కింది.కాని దొంగ రవాణా దారుల బారిన పడి అవి మిగలకుండా పోతున్నది. ప్రజల సహకారం లేనిదే దొంగ రవాణా అరికట్టడం సాధ్యం కాదన్నారు. దోపిడీ దొంగలు, నక్సలైట్ల విషయంలో ప్రజలు అపోహ పడక, వారు సంచరించే విషయం తమ శాఖకు తెలిపితే గుప్తంగా వుంచి, తగిన చర్యలు తీసుకొంటామని చెప్పారు.

### పంచాంగం

#### ముహూర్తములు

తేది 7 శనివారము రాత్రి 3.28 గంటలకు మిథున లగ్నమున వివాహములకు సుముహూర్తముల కలదు.

#### ఆగస్టు తిథులు

| | |
|---|---|
| తే 7 శని పంచమి రా.గ. | 12.15వ |
| తే 8 ఆది షష్ఠి రా.గ. | 2.15వ |
| తే 9 సోమ సప్తమి రా.గ. | 4.00వ |
| తే 10 మంగళ అష్టమి రా.గ. | 5.20వ |
| తే 11 బుధ నవమి పూర్తిగ | |
| తే 12 గురు నవమి ఉదయం | 6.10 వ |
| తే 13 శుక్ర దశమి ఉదయం | 6.30 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు



## నెల్లూరు 3 వ డి.ము. కోర్టులో

O.S. 483/92

వాది: Vijaya Bank, Nellore Represented by its Manager

Vs

ప్రతివాది: 1. బండి వారయ్య

To

(1) బండి వారయ్య, S/o. పేరయ్య
(2) యాగా శేషయ్య, S/o. సుబ్బయ్య
రాజేంద్రనగర్, నెల్లూరు

### నోటీసు

పై నెంబరు వాది దావా మొత్తం రూ. 11,845.00 యున్ను, దావా కర్చులున్ను రాబట్టుకొను నిమిత్తం దావా చేసియున్నారు. మీకు గల ఆక్షేపణలను 12.8.93 తేది పగలు 10 గంటలకు పై కోర్టుకు హాజరై తెలుపుకోవలసినది. లేని యెడల మీ పరోక్ష మందు తీర్మానించబడును.

S.V. Sarma
Advpcate for Plantiff



మరువలేని మానవతావాదికి

# అశ్రుతర్పణం



మాకు అత్యంత ఆప్తులు చక్కని సలహాలనిచ్చి మా విద్యా సంస్థలు
ప్రగతి పథాన పయనించేందుకు దోహదకారైన మంచి మిత్రులు

# శ్రీ నెల్లూరు శ్రీరామమూర్తి

గారి నిర్యాణానికి చింతిస్తూ, వారి ఆత్మకు
దైవ సన్నిధిన చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ
అశ్రుతర్పణం అర్పిస్తున్నాము.

నేదురుమల్లి పద్మనాభరెడ్డి – కరస్పాండెంట్
విద్యానగర్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్స్
వాకాడు, నెల్లూరు జిల్లా

# శివారెడ్డి పద్యాలు

### శ్రద్ధాంజలి

అయిపోయింది టైము, అవసానకాలమ్ము
దగ్గరైంది త్వరలో దాటుకుంటు
నీకు అందగుండు నేనొచ్చ శ్రీరామ
మూర్తి, నీవే ఇల్లు, వాక్యమింక!

ఎక్కడ భార్యాబిడ్డలు
ఎక్కడ తల్లిదండ్రి ఎవరికెవ్వరిదంతా
టక్కరి ఎందుకు నీకీ మక్కువ
మూణ్ణాళ్ల భాగవతము ఇదంతా!

శోభ, ప్రసాదు
(లేగుంటపాడు)

ఎందుకు పుట్టిస్తాడో,
ఎందుగ్గ చంపుతాడో, ఎవ్వరెరుగు ఈ
మందల దేవ రహస్యము
ఇందర ఇలాగ పెద్ద ప్రాబ్లం కవిక!

అందగత్తె వధువు. అబ్బాయిపస్టాసు
తగిన యీడు జోడు ట్రాన్సుపెట్టి
తూచి వ్రాశే తక్కిల్లో వారుంటె
తప్పునాది గారు తరచరాదు

ఇనమడుగు ప్రసిద్ధి

అతికష్మార్తి గారు అయ్యా శ్రీరామ్మూర్తి
నీకు సాటిమేటి నిన్ను బోలు
నీతినిష్ఠ పరుడు నెల్లూరు జిల్లాలో
పుట్టరింక. పుడితె ఒట్టు సెలవు

ఎన్ని వైద్యశాల్లు, ఎన్నెన్ని లైబ్రరీలు
ఎన్నిపారశాల్లు ఇంతలోనె పైకి దెచ్చి
నిన్ను ప్రసిదెంటు అర్లాదే,
దీనకంతటికిని దీప్తతార!

## జనవాణి

(3 పేజీ కొరవ)

రైనేజీ కాల్వ పై 20 అడుగుల స్లాబు వేసి ఆఘమేఘాల మీద నిర్మాణం చేపడుతున్నారు. ఇటీవల ఆక్రమణలు పెచ్చు పెరిగి పోవడం వల్ల పుయ్యాల కాల్వపైపూడిక తీయడం ఇక బ్రహ్మతరమేమో ; వీటివల్లే నాలుగు చినుకులు పడితే చాలు టౌన్‌లోని రోడ్లు ఏర్లుగా మారుతున్నాయి. ఇకనా పి.డబ్ల్యుడి శాఖ నిద్ర నుండి మేల్కొని తగిన చర్యలు తీసుకోకపోతే పి.డబ్ల్యుడి వారి కాల్వలు వారికే కనపడని స్థితిక రాక తప్పదు.

నెల్లూరు —ప్రశాంత్

### వుద్యమానికి శరాఘాతం

ఈ సంవత్సరం అక్టోబర్ 1 నుండి అన్ని జిల్లాలలో సారా నిషేధించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఆంధ్ర మహిళల మహత్తర సారా వ్యతిరేక పోరాట ఫలితంగా నిషేధం సాధించామన్న తృప్తిని పొగుడుతూ 5వేల జనాభాకు ఒక బ్రాంది షాపు లెక్కన 18 వెల బ్రాందీ షాపులను వేలం పాటల ద్వారా కాంట్రాక్టర్లకు ఇవ్వాలని రాష్ట్ర ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయం మహిళలను దిగ్భ్రాంతులను చేస్తున్నది. సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని లక్ష్యంగా పెట్టుకొన్న ప్రభుత్వం ఈ విధమైన పనికి పాల్పడి తన ద్వంద్వ వైఖరిని చాటుకొంది. వుద్యమానికి చేయి అందిస్తూనే శరాఘాతం కూడా చేసింది.

నెల్లూరు —ఇ.వి.ఎస్. నాయుడు

### విజయమహల్ గేటు వద్ద మార్పులు

ఇంతకు ముందున్న రైల్వే గేటు, దానికి తోడుగా కొత్తగా మల్లించిన ట్రాఫిక్ వల్ల విజయమహల్ గేటు వద్ద తీవ్ర ట్రాఫిక్ సమస్య గంట గంటకు ఏర్పడుతుంది. సిగ్నల్ రాక ఈ గేటు వద్దకు వచ్చేసరికి రైళ్లు ఆగిపోతాయి. బృందావనం మీదుగా మల్లించిన ట్రాఫిక్‌కు తోడుగా ఇందిరా భవన్ వైపు నుండి వచ్చే ట్రాఫిక్ చూస్తేనే గాని వర్ణించడానికి వల్ల కాదు. ఈ పరిస్థితిని చక్క దిద్దేందుకు ఎస్‌పి చర్యలు తీసుకోవాలి. విజయమహల్ గేటు వద్ద ఇరువైపుల ఇద్దరు సమర్థవంతమైన కానిస్టేబిళ్లను నియమించాలి. గేటు వేసినపుడు వాహనాలను ఇరువైపులా ఎడమ వైపు నిలబడేలా చేయాలి. రోడ్డు మధ్య ఎడమ, కుడి వైపులు సూచిస్తూ 20 అడుగుల వరకు తెలుపు లేదా పసుపు రంగులో గీతవేస్తే క్రమబద్ధీకరణ వల్ల సమస్య కొద్దిగా పరిష్కారం కావచ్చు. నాయకులు బ్రిడ్జి సంగతి పట్టించు కొంటే ఇంకా బాగుంటుంది.

నెల్లూరు —కె. బాలసుబ్రహ్మణ్యం

### సిగ్గు పడాల్సిన విషయం

పి.వి. నరసింహా రావు గారు అవిశ్వాస తీర్మానంలో గెలిచారు. ఆ గెలుపు వెనుక ఎన్ని లొసుగులున్నాయో ? అజిత్‌సింగ్ వర్గాన్ని చీల్చారు. ఎం.పి.లను కొన్నారన్న ఆరోపణ వుంది. ఈ పనికి బదులుగా ప్రజల దగ్గరకు వెళ్లి వాస్తవ విషయం చెబితే కాంగ్రెస్‌కు ఓటివ్వరా?

నెల్లూరు —ఎస్.వి. సుబ్బారావు

## స్పీకర్

మొదటి పేజీ కొరవ

ఆయన భేషజాలాన్ని విస్మరించి ప్ర ... వర్గాల్ని ప్రాథేయ పడ్తున్నారు. రాష్ట్రంలో ఉప ఎన్నికలయ్యే వరకు మంత్రి వర్గ విస్తరణను కూడా వాయిదా వేశారు. కర్నూలు టిక్కెట్టుకు అధికారిక ప్రకటన వెలువడ కుండానే కోట్ల సూర్యప్రకాష్ రెడ్డి ప్రచారం ప్రారంభించారు. కర్నూలు లోక్ సభ ఎన్నికలకు సర్వ శక్తులను సమాయత్తం చేసి ప్రయత్నం మొదలైంది.

## రేరాజు

(2 పేజీ కొరవ)

శ్రీరామమూర్తి గారి రూంలో మేమంతా కలసి చదువుకొనే వాళ్లం. చిన్నప్పుడు చాలా గుంభనంగా వుండేవారు. అటువంటి వ్యక్తి పాఠకులను మంత్ర ముగ్ధులను చేసే మహా సంపాదకుడుగా ఎదిగిన తీరు చూసి తెగ ఆనంద పడిపోయే వాడిని. నేను ఆరోగ్యం గూర్చి వాకబు చేసినపుడు బాగుందని చెప్పి ఇంతలో వదలి వెళ్లిన ప్రియమిత్రుడి స్మృతులు మరవలేను.

గూడూరు —బండి వేణుగోపాల రెడ్డి

### శైలి అద్భుతం

శ్రీరామమూర్తి గారి సరళమైన రచనా శైలి నన్ను ఎంతగానో ఆకట్టుకొనేది. 'జమీన్‌రైతు' చేతి కందిందే తడువు 'పినాకినీ తీరం' కోసం రెండవ పేజీ పైన దృష్టి కేంద్రీకరించే వాడిని. పెండ్లింట్ల శీర్షికను ఆయనంత ప్రతిభావంతంగా ఎవరూ వ్రాయలేరని నా దృఢ విశ్వాసం.

అనంతపూర్ —ఎ. పున్నారావు

### తీర్చలేని లోటు

45 ఏళ్లుగా సంపాదక శాఖ నిర్వహించడం సామాన్య విషయమేమి కాదు. అందులో ప్రజ్ఞావంతంగా ఆ పనిని నిర్వహించిన శ్రీరామమూర్తి గారు ఆదర్శ మూర్తి. ఆయన మరణపు లోటు తీర్చలేనిది పూడ్చలేనిది.

విజయవాడ —వేమూరి బలరామ్
ఎడిటర్, స్వాతి

### నా పుట్టిల్లు జమీన్‌రైతు

నెల్లూరుతో నా కున్న మరో పాత సంబంధం కూడా తెగిపోయింది. శ్రీరామమూర్తి గారిని తలచుకుంటే, ఎన్నెన్ని జ్ఞాపకాలో ముసిరి, నన్ను వుక్కిరి బిక్కిరిచేస్తున్నాయి. ఎప్పుడో రాశాను. - 'నా పుట్టిల్లు జమీన్‌రైతు కార్యాలయం' అని; మూగబోయిన హృదయంతో కలం కదలడం లేదు.

—డాక్టరు రావూరి భరద్వాజ
హైదరాబాద్

### అడుగు జాడల్లో నడుద్దాం

పూజ్యులు, పెద్దలు జిల్లా ప్రాతికేయులకు వెన్నెముక వంటి శ్రీరామమూర్తి గారు దివంగతులైన వార్త నన్ను దిగ్భ్రాంతుడిని చేసింది. 60 ఏళ్లు జనరంజకంగా పత్రికను నడపడం ఒక మైలురాయైతే, 40ఏళ్లు సంపాదకత్వ నిర్వహించడం ఆయనకే చెల్లింది.

హైదరాబాద్ టి.వి. రాఘవాచార్యులు
డిప్యూటీ డైరక్టర్, దూరదర్శన్

### యువజర్నలిస్టులకు ఆదర్శప్రాయం

శ్రీరామమూర్తి గారి మరణ వార్త జిల్లా వాసిగా నన్ను ఎంతగానో కలచి వేసింది. ఆయన వ్యక్తిత్వం, జీవితం యువ జర్నలిస్టులకు ఆదర్శప్రాయంగా నిలుస్తుంది. గతించినా ఆయన కీర్తి పాత్రికేయ ప్రపంచంలో ధ్రువతారగా వెలుగొందు తుంటుంది.

హైదరాబాద్ —బి. గోపాల్ రెడ్డి
వైస్ ఛాన్సలర్, జె.ఎన్.టి.యు

### రైతాంగానికి తీరని లోటు

పిన తండ్రి రామానాయుడి గారి వల్ల ప్రభావితుడైన శ్రీ నెల్లూరు శ్రీరామమూర్తి, జమీన్‌రైతు సంపాదకునిగా, రచయిత గా తెలుగు పత్రికా రచనలో కొత్త పరవడిని, విధానాలను సృష్టించారు. రామ్మూర్తి గారి రచనలు వివరణాత్మకతకు, విమర్శనాత్మకతకు, విశ్లేషణలకు దర్పణంగా నిలిచాయి. నిరుపమాన వచన రచనా విధానం వినూత్న సరళోపేతమైన శైలి, అసమాన పద లాలిత్యం శ్రీరామమూర్తి గారి సొత్తు. శ్రీ రామానాయుడు గారి నెల్లూరు ముచ్చట్లు, శ్రీ రామ్మూర్తి గారి పినాకినీ తీరం శీర్షికలు పుస్తకంగా ప్రచురించిన ఎడల ప్రయోజనాత్మకంగా ఉండగలదని నా అభిప్రాయము.

నెల్లూరు —పి.సి. రెడ్డి

### నమ్మలేకున్నాను

'జమీన్‌రైతు' శ్రీరామమూర్తి గా రాష్ట్రం నలుమూలలా సుపరిచితుడైన నెల్లూరు శ్రీరామమూర్తి మరణ వార్త నన్నెంతగానో కలవర పరచింది. దాదాపు మూడున్నర దశాబ్దాలుగా జమీన్‌రైతు పాఠకుడనైన నేను ఆయన లేరంటే నమ్మలేకున్నాను. హై స్కూలు విద్యార్థి దశ నుంచి రామమూర్తి గారి కలం నుంచి వెలువడే విమర్శలు, వ్యాఖ్యలు, వ్రాతలంటే నాకెంతో ఇష్టం. నేను విశ్వవిద్యాలయ స్థాయిలో ఆంధ్ర విశ్వవిద్యాలయం హాస్టలు లైబ్రరీకి జమీన్‌రైతు తెప్పించి మా నెల్లూరు పత్రిక అని గర్వంగా చెప్పుకునే వాడిని. ఆనాటి తెలుగు భాష శాఖాధిపతులు స్వర్గీయ గంటిజోగి సోమయాజులు గారు, స్వర్గీయ జోగారావు గారు తమ ఉపన్యాసాలలో తెలుగు వాడి గ్రామీణ జీవితానికి అద్దం పట్టె పత్రిక జమీన్‌రైతు అని పేర్కొంటుంటే నెల్లూరీయుడిగా నేనెంతో గర్వపడేవాడిని; ఉద్యోగ రీత్యా నెల్లూరు వదలి వెళ్లినప్పుడు జమీన్‌రైతు చదువు తుంటుంటే నెల్లూరులోనే వున్నట్లనిపించేది. అటువంటి జనాకర్షణీయమైన పత్రికా వ్యాసంగంతో జీవితాన్ని గడిపిన మహనీయుడు శ్రీరామమూర్తి గారు. నా అభివృద్ధిని కాంక్షించే ఆ శ్రేయోభిలాషి ఇక లేడంటే ఎంతో బాధాకరంగా వుంది.

— ఎమ్. చంద్రశేఖరయ్య
హైదరాబాదు
అడిషనల్ డైరక్టర్
సమాచార పౌర సంబంధాల శాఖ

### నెల్లూరు జిల్లాకే రాజకీయ సలహాదారు

నా ... సాన్నిహిత్యం ఈనాటిది కాదు; నాలుగున్నర దశాబ్దాల నాటిది. ఆనాటి విద్యార్థి కాంగ్రెస్‌లో ఇద్దరమూ చురుకుగా తిరుగుతుండే వారం. ఆ తర్వాత ఇద్దరమూ జర్నలిస్టులుగా ఒకరికొకరం అతి సన్నిహితంగా వుండే వాళ్లం. దాదాపు నలభై ఏళ్ల పాటు పత్రికా సారథ్యం నిర్వహించి, నెల్లూరు జిల్లాకే రాజకీయ సలహాదారుగా పేరు తెచ్చుకున్నారు; మన్ననలందు కున్నారు. జమీన్‌రైతు సన్మానం అందుకున్న వాళ్లలో నేనూ ఒకర్ని కావడం ఆ సాన్నిహిత్యం వల్లనే ననుకుంటాను.

మద్రాసు — బి.ఎస్.ఆర్. కృష్ణ
సీనియర్ జర్నలిస్ట్

### లోటు పూడ్చలేనిది

స్వర్గీయ శ్రీరామమూర్తి గారు, బి.వి. రెడ్డి గారు నెల్లూరు పేరును ప్రపంచ వ్యాప్తంగా చాటిన ఘనులు. ఆ మహనీయు లిద్దరూ సుదూర లోకాలకు తరలి వెళ్లి పోయారు. ఆ లోటును భర్తీ చేసే వాళ్లు ఎవరు?

నెల్లూరు —సి. రామకృష్ణ
మాజీ పబ్లిక్ ప్రాసిక్యూటర్

### సాహితీ స్ఫూర్తిదాత

నాలో చిన్నతనం లోనే సాహితీ స్ఫూర్తి కల్గించిన జ్ఞాని శ్రీరామమూర్తి గారు. పత్రికలో పద్యాలు నిషిద్ధమన్న రోజుల్లో కూడా నా పద్యాలు వేసిన మహానుభావుని మరణం నన్ను కృంగదీసింది.

మదరాసు —డాక్టర్ బి.టి. రావు

### అరుదైన వ్యక్తి

పత్రికారంగంలో కొందరు అరుదైన వ్యక్తులుంటారు. ఆ కోవకు చెందిన విశిష్ట వ్యక్తి శ్రీ శ్రీరామమూర్తి గారు. ఆయన చేసిన సేవలు జిల్లా చరిత్రలో కలకాలం నిలిచి పోతాయని నిర్భయంగా చెప్పగలను.

హైదరాబాద్ —ఎస్. రమేష్‌బాబు

### వృత్తిలో వైశిష్ట్యం

శ్రీరామమూర్తి గారు అసాధారణ పాత్రికేయుడు. జర్నలిజం వృత్తిలో ఒక విశిష్టతను నెలకొల్పిన ఉదాత్తులు. తన పత్రిక కోసం పాఠకులు ఎదురు చూసే విధంగా మల్చిన ప్రతిభావంతుడు. వేడి వార్తలను అంతకంటే వాడియైన భాషలో అందించే వారాయన. నా మటుకు నేను పత్రిక కోసం ప్రతివారం ఎదురు చూసి, చదివి, ఆనందించే వాడిని. ఆయన మరణించారన్న వార్త ఆకాశం నుంచి హఠాత్తుగా పడిన పిడుగు వలె నన్ను నిరుత్తరుడ్ని చేసింది.

- బి. స్వామిదాసు
రిటైర్డ్ డి.ఇ.ఓ., స్వామిదాసు స్కూలు

## కోట్ల ఆశ

మొదటి పేజీ కొరవ

ప్రధానిని కలిసి ముఖ్యమంత్రి వైఖరిని దుయ్యబట్టారట. ప్రధాన మంత్రి పదవి కోసం కోట్ల చేస్తున్న ప్రయత్నాలను ఆయన పి.వి. దృష్టికి తెచ్చారట. పిసిసి అధ్యక్షుడు మర్రి తులసీదాస్ కూడా కోట్ల పై ఆరోపణల్ని ప్రధానికి వినిపించారట. మాజీ మంత్రి కనుమూరి బాపిరాజు కూడా ప్రధానిని కలుసుకొని ముఖ్యమంత్రి వైఖరి పై నిరసన వ్యక్తం చేసినట్లు తెలుస్తోంది.

# మీనాకు వయసుని బట్టి రేటు

నటి మీనా తల్లిరాజకోకిల కూడా ఒకప్పటి నటి. కూతురు బిజీ అవడంతో ఈమె నటనకు తిలోదకాలివ్వక తప్పింది కాదు. మీనాకు తోడుగా షూటింగ్‌లకు హాజరయ్యే ఈమె మరో వంక కాంగ్రెస్ ఐ ప్రచారకార్యకర్తగా తమిళంలో అనర్గళంగా ఉపన్యసించడంలో తనకు తానే సాటి అని పేర్గాంచింది. ఇటీవల మీనాను బుక్ చేయడానికి ఒక నిర్మాత వస్తే, ఈ తల్లి ''అప్పుడు మా అమ్మాయి పారితోషికం ఆమె వయసంత'' అందట. ప్రస్తుతం మీనా వయసు 18. ఆమె వయసును బట్టి రేటు మారుతూ వుంటుందా?

# సెన్సార్ సభ్యుడైతే లక్షల ఆదాయం?

పదవి నలంకరించే సమయంలో ప్రాంతీయ సెన్సార్ బోర్డ్ అధికారి. సమాజాన్ని కలుషితం చేసే దృశ్యాలను నిర్దాక్షిణ్యంగా తొలగించేస్తానని చేసిన ప్రతిజ్ఞ హుళక్కేనా? ఇటీవల విడుదలవుతూన్న తెలుగు చిత్రాలు చూస్తుంటే, అసలు సెన్సార్ బోర్డు అనేది ఒకటుందా అని ఎందరో ముక్కు మీద వేలేసుకుంటున్న సంశయం వెనుక ఇంతటి గ్రంథం జరుగుతూన్న విషయం ఇంత కాలానికి బయట పడింది.

సెన్సార్ బోర్డు సభ్యుడవడానికి ఎందరో తంటాలు పడుతుంటారు. అయిదేళ్ల పదవిలో లక్షణంగా లక్షలు సంపాదించ వచ్చని చాలా మంది ఆశ. అలా సంపాదించని వారు లేకపోలేదు.

## సినిమాల్లో బూతు మితి మీరిపోవడం వెనుక కథలేమైనా వున్నాయా?

సెక్స్, క్రయిమ్ అతిగా వున్న చెత్త చిత్రాలకు 'యు' సర్టిఫికెట్ పారేయవచ్చు. దేశం, యువతరం ఎలా పోతే ఎవరికి కావాలి?

# కథలో కొత్తదనం, కథనంలో కమ్మదనం: అమ్మకొడుకు

**చిత్రసమీక్ష**
** * **
**చిన్ని నారాయణరావు**

కథలో కాసింత కొత్తదనం, కథనంలో మరి కొంత కమ్మదనం కలిసి వెరసి క్రాంతికుమార్ అమ్మకొడుకు చిత్రంగా మారింది. అసహజత్వానికి అనర్థ దాయకత్వానికి పెట్టింది పేరుగా తెలుగు చిత్రాలు విరాజిల్లుతున్న ఈ రోజుల్లో అంతో ఇంతో సహజత్వం, కొంతలో కొంత మంచితనం ప్రతిపాదించ గలిగే అమ్మకొడుకు వంటి సినిమాల్ని ఆదరించాలి. ఇది క్రాంతికుమార్ స్థాయిలో లేకపోయినా, వ్యాపార జిమ్మిక్కులతో సగటు ప్రేక్షకుడు తన కాలాన్ని సులభంగా వెళ్లబుచ్చగలిగే పాటి సినిమాగా కూడా దీన్ని పేర్కొనవచ్చు.

దగాపడిన ఒక తల్లి తన కొడుకును ప్రయోజకుణ్ణి చేయడంతో బాటు, తన మాట జవదాటని వ్యక్తిత్వంతో తీర్చిదిద్దింది. అయినా తన బిడ్డ ప్రేమకథను అంగీకరించి తన జీవితాన్ని నాశనం చేసిన వ్యక్తి కూతురునే పెళ్లి చేసుకొమ్మనే స్వార్థ త్యాగం చేసిన ఒక మహిళ కథే ఈ సినిమా ఇతివృత్తం.

తన చెల్లెల్ని పెళ్లాడబోవడం లేదన్న కక్షతో హత్యచేయించే బంగార్రాజు వంటి పాత్రలు ఈనాటి సమాజంలో కోకొల్లలు. పాటల జానకిగా ఈసడించడంలో కూడా తప్పులేని వాళ్లని ఎండగట్టి లోకం పోకడ తెలుస్తుంది.

రమణ, రాజకుమారిల మధ్య ప్రేమను దరిలించడం నుంచి వారిద్దరి



పోలీస్‌లాకప్‌లో విజయశాంతి

ప్రేమను పాదుకొల్పిన తీరు చాలా హుందాగా ఉంది. తన మామయ్య గుండాయిజాన్ని ఎదిరించిన వ్యక్తి రమణను రాజకుమారి ప్రేమించడం, ఆరాధించడం చక్కగా చూపగల్గాడు దర్శకుడు! రాజకుమారికి ఏదైనా జరుగరానిది జరిగితే పంబరేపుతాననే స్థితికి రమణ చేరడాన్ని చాలా సమంజసంగా మలిచారు. ఎటొచ్చీ రాజకుమారి ముద్దు ముద్దు మాటలు ఆ రూపానికి తగ్గట్టు లేవు. ఆ పాత్రకు రాజసం నిండిన తరహా మాటలు అయితే మరింత నిండుదనం చేకూరేది.

హాస్యం కోసం సృష్టించిన పిసినారి సుబ్బయ్యగా కోట, ఆయన అసిస్టెంటుగా బ్రహ్మానందం పాత్రలు చక్కని హాస్యాన్ని చిలకరించగల్గాయి. కోట చొక్కా కథ ఒక తమాషా! అలాగే బ్రహ్మానందం తన 'మగ' మేనకోడలు జ్యోతిమాలినితో కోట ప్రణయం, ఆ తర్వాత ప్రళయం మరో తమాషా. అయితే బ్రహ్మానందాన్ని ముద్దాడే స్త్రీపాత్ర జుగుప్సాకరంగా తయారయింది.

ఇప్పటి సినిమాల్లో హద్దులు లేని ఈ ముద్దులు యువతపై మరింత దుష్ప్రభావాన్ని చూపుతున్నాయి. ఇలాంటి వాటికి సెన్సారు కత్తెర వేయాల్సిన అగత్యం ఎంతైనా ఉందనడంలో సందేహంలేదు.

అరువు రేపు అనడంలోని 'రేపు'కు అర్థం మానభంగంగా తీసుకొని ఇనుపు మానభంగంగా పేర్కొనడం చాలా దారుణం!

మాష్టారు కూతురు గ్రాసణి రమణను ప్రేమించడం, రమణ హృదయాన్నెరిగి తాను వేరేమనువాడడం గొప్పగా రూపొందించాడీ సన్నివేశాన్ని దర్శకుడు క్రాంతి!

కొరవ 15 పేజీలో

# హీరోలకు ముప్పాతిక కోటి పారితోషికం!

ఎన్నో నెలలు శ్రమపడి స్క్రిప్టును సిద్ధం చేసుకొని, తీరా షూటింగ్ ప్రారంభానికి ముందు ఒక నిర్మాత ''ఇక నేను సినిమా తీయలేను బాబోయ్'' అని చేతులెత్తేశాడు. ఆ హీరో 75 లక్షల పారితోషికం అడిగాడట. ''ఆయనకిచ్చే ఆ 75 లక్షలను బాంకులో వేసుకుంటే నిక్షేపంగా వడ్డీ వస్తుంది కదా? అనవసరంగా సినిమా తీసి ఆయాస పడడమెందుకు?'' అనుకున్నాడట. బతికిపోయాడు.

కొరవ 15 పేజీలో

# మొగుడుగారు: ముఖంమొత్తే బూతు!

**చిత్రసమీక్ష – అల్లూరు రహీం**

మోహన్ గాంధీ, పరచూరి సోదరుల కాంబినేషన్ అంటే కర్తవ్యం, ఆశయం, పోలీస్ బ్రదర్స్; వినోద్‌కుమార్, యమున జంటంటే మౌనపోరాటం చిత్రాలు గుర్తుకొస్తాయి పై చిత్రాలు ఒకింత ఆదర్శం. ఆలోచనల వైపు ప్రేక్షకులను మళ్లిస్తాయి. కాని వీరి కాంబినేషన్‌లో వచ్చిన 'మొగుడు గారు' చిత్రంలో ఈ విలువలన్నీ వలువలు లేకుండా పోయాయి. చిత్రంలో ప్రతి పాత్ర దరిదాపులు నైతిక పతనం గలదే. హీరో ఎప్పటి కక్షో పెట్టుకొని హీరోయిన్‌ను బిడ్డ తల్లి చేసి వదులుతారు. హీరోయిన్ ఆడపిల్లని మరచి పోయి మరీ బరితెగించి ప్రవర్తిస్తుంటుంది. మరో హీరోయిన్ పతిత కూతురు. వీరిద్దరి తండ్రి వయువంచకుడు. చివరికి కామెడీ కోసం పెట్టిన నటులు గొడవ పడే సమయం పందుల్ని చూపించడం, వారి వస్త్రధారణ మరీ అసహ్యంగా వున్నాయి.

పరచూరి సోదరుల మాటలు వేటూరి సాహితీ సొంపులు మరీ బరితెగించాయి. చేతులు వేయకుండానే పెపులు మార్చేశాడా; మంచి రోజా చూసి పెట్టించు కొంటాను ముద్దు వంటి మాటలు సందులోకి రానా చక్కని రావా తప్పుదు తలుపులు తీయడం ఎప్పటికైనా పాటలు బూతు సాహిత్యానికి పరాకాష్ఠగా నిలిచాయి. ఒక పాటలో హీరోయిన్ చొక్కా మాత్రమే వేసుకొని రికార్డ్ డ్యాన్సర్‌లా రెచ్చిపోతే మరో పాట బేటా హిందీ చిత్రంలో మాధురీ దీక్షిత్ కాపీ చేసి తీసిన దానిలో శరీరాన్నంతా కనువిందు చేసింది. చెప్పదంటు కథను ఎలాగోలా నడిపించేందుకు దర్శక రచయితలు కష్టపడ్డారు. చివరన క్లైమ్ సెంటిమెంటుతో కన్నీటి సెలయేర్లు పారించాలని ఎక్కడో పత్రికల్లో చదివిన వార్త బోరింగ్ కోసం తవ్విన గుంటలో పడి బాలుని దుర్మరణాన్ని స్ఫురణకు తెస్తుంది.

వేణుగోపాల్ (వినోద్‌కుమార్) కిడీస్ కాలేజి ముందు ఫాన్సీ షాపు పెట్టుకొని రాణి (రోజా)ని ఆకర్షిస్తాడు. రాణి కాలేజిలో మరీ రౌడీ పిల్ల. ఫాన్సీ షాపుల్లో విరోధ ప్యాకెట్లు అడిగే ధైర్యవంతురాలు. దుర్గ (యమున) శాంత స్వభావురాలు. రాణి రౌడీయిజానికి బాధితురాలైన తరువాత స్నేహితురాలుగా మారుతుంది. వేణుగోపాల్, రోజా బొటానికల్ టూర్‌కి పోయినప్పుడు వెంటపడిపోయి ప్రమాదం నుండి రక్షించి మనసుతో పాటు సొగసు దోచుకుని ఆమెను తల్లిని చేస్తాడు.

గతంలో స్మగ్లర్ బాపినీడు (విజయ కుమార్) వల్ల తన తల్లి, తండ్రి అన్యాయంగా పెళ్లి పందిరిలో ఆహుతి అయి పోయినందుకు రాతి మనిపై రాణిని పెళ్లి చేసుకోనంటాడు వేణు. ఒకానొక సారి వ్యభిచారం కేసులో ఇరుక్కొని కోర్టుకు వెళ్లిన దుర్గను తన ప్రియురాలని చెప్పి బయటకు తీసుకొస్తాడు. ఆమెతో పెళ్లికి సిద్ధమైన తరుణంలో రాణి గర్భవతన్న విషయం దుర్గ చెబుతుంది. ఆ సమయంలోనే దుర్గ తల్లి తన తండ్రి వల్ల వంచింప బడిందనే విషయం తెలుసుకొని కుమిలి పోతుంది. అప్పటి నుండి దుర్గ త్యాగశీలగా నిలిచి పోతుంది.

పుట్టిన బిడ్డ వేణుగోపాల్ మనసును మారుస్తాడు. ఆ బిడ్డ

కొరవ 15 పేజీలో

# వై. విజయ సాధించింది

షూటింగ్ స్పాట్‌లో వై. విజయ ఉంటే వాలు నవ్వులకు కొదువ ఉండదు. ఇటీవల ఆమె తోటి నటీనటులకు, సాంకేతిక వర్గానికి చాకెట్లు పంచుతూంటే, "ఏమిటండీ, ఏదైనా గుడ్ న్యూస్?" అని అడిగితే సాధించాను, సాధించాను, అందుకే ఈ సంబరం. మా అమ్మాయి అనూషాకు 'గుడ్ షప్పర్డ్ కాన్వెంట్'లో సీటు సంపాదించడంకోసం మూడురోజుల పాటు 'క్యూలో' నిలుచొని సాధించానండోయ్.' అంది పరమా నందంతో.

"యు.కె.జి లో సీటు సంపాదించడానికి అంత కష్ట పడ్డారా? కంగ్రాట్స్." అంది పక్కనే ఉన్న వాణీ విశ్వనాథ్.

# నిర్యాణము

మా తండ్రి గారు



## శ్రీ పెల్లేటి గోపాలకృష్ణారెడ్డి గారు

పెద పరియ

31.7.1993 వ తేదీన హైదరాబాదులో పరమ పదించినారు.

కుమారుడు

పెల్లేటి సూర్యనారాయణ రెడ్డి

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

హాస్పిటల్ ఒక పిలిమ్‌ నిర్మిస్తున్నారు. ఆగస్టు నెలలో షూటింగ్ కార్యక్రమాలు మొదలై అక్టోబర్ 2 తేదీ నాటికి పూర్తవుతాయి. అనంతరం ఈ ఫ్యాకెట్‌ను ప్రభుత్వానికి సమర్పిస్తారట. ఈ పిలింలో అర్ధము ప్రముఖ సినీ దర్శకులతో పాటు వలువురు చిన్న పిల్లలు కూడా నటిస్తారని కళా నిలయం కార్యదర్శి పి. మురళీ ప్రసాద్ తెలిపారు. ఫిలిమ్ రచన జి. రాఘవేంద్ర చేస్తుంటగా, దర్శకత్వం బాధ్యతలు ఎ.ఎం. రత్నం వహిస్తున్నారు.

### టర్నోవర్ టాక్సు- వ్యాపారుల బంద్

ప్రభుత్వం విధించిన టర్నోవర్ టాక్సును నిరసనగా 31 తేదీ టౌన్‌లోని వ్యాపారస్తులు తమ అంగళ్లు మూసి వేసి బంద్ పాటించారు. 16 వాణిజ్య సంఘాల ఆధ్వర్యంలో స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకాపరమేశ్వరి దేవాలయం వద్ద నుండి కలెక్టరేట్ వరకు నినాదాలు చేస్తూ ప్రదర్శన నిర్వహించారు. సంఘాల ప్రముఖులు సి.సి. సుబ్బరాయుల శెట్టి, చీరెల్ల వెంకటేశ్వర్లు, కనమర్లపూడి తిరుమల రావు, వొమ్మిన సుబ్రహ్మణ్యం ప్రదర్శనకు నాయకత్వం వహించారు.

### బళ్ళారి రాఘవ జయంతి సభ

ప్రఖ్యాత నాటక కర్త బళ్లారి రాఘవ 113 వ జయంతి సభను కళాసుధ సాంస్కృతిక సంస్థ 2 తేదీ టౌన్‌హాల్‌లో ఘనంగా జరిపింది. శ్రీ సి.సి. సుబ్బరాయులు శెట్టి అధ్యక్షించిన సభకు డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. హిరణ్యకశ్యపు పాత్రను బళ్లారి రాఘవ అమోఘంగా పోషించే వారని ఆ నటన తననెంతో ఆకట్టుకొనేదని శ్రీ గోపాల్ రెడ్డి అన్నారు. తాను ఎప్పుడూ బళ్లారి వెళ్లినా ఆయన ఆతిథ్యమే స్వీకరించేవాడినని చెప్పారు. పౌరాణికబ్రహ్మ శ్రీ కమలాకర కామేశ్వర రావు కళాసుధ స్థాపకులు శ్రీ శ్రీనివాస రావు రచించిన నటయోగం పుస్తకాన్ని ఆవిష్కరించారు. సభలో శ్రీ పెంచలసింగ్, శ్రీ దాశరథి కూడా పాల్గొన్నారు.

### అమ్మ కొడుకు

13 పేజీ కొరవ

సముద్రంలో దూకి చావాలనుకున్న వ్యక్తికి ముత్యాలు దొరకడం, ముత్యాలు తేవాలనుకున్నవ్యక్తి మరణించడం వంటి చక్కని సంఘటనలున్నాయి చిత్రంలో. ఎవరి అదృష్టం ఎలా ఉంటుందో చెప్పలేమన్న దానికి శ్రావణి మాట్లాడిన పై మాట చాలా గొప్పగా మనసుకు హత్తుకుంటుంది.

రాజశేఖర్ ఈ మధ్య విభిన్న భూమికల్లో ప్రత్యక్ష మవుతూ రాణిస్తున్నాడు. మనకున్న కొద్ది మంది మంచి నటుల్లో -శేఖర్ ఒకడు! ఈ సినిమాలో చాలా [illegible]ంగా నటించ గల్గాడు. శ్రావణిగా ప్రేమికురాలి పాత్రలో ఆమని చక్కగా హావభావాలు ప్రదర్శించింది. రాజకుమారిగా సుకన్య సమ్మోహన గానంతో హాయిగా నటించింది.

వేటూరి సాహితీ ఘుమఘుమలు ఈ చిత్రంలో అంతగా కన్పించలే దెందువల్లో! ఇది మొత్తానికి ఒక జనరంజకమైన చిత్రం.

### మొగుడు గారు

(13 పేజీ కొరవ)

లేకుండా ఒక్క క్షణం గడప లేకపోతారు. చివరికి ఆ దీర్ఘ ప్రమాదంలో చిక్కుక పోవడం, వార్ని రక్షించేందుకు భార్య, భర్తలు ఒకటి కావడం జరుగుతుంది.

వినోద్ కుమార్, రోజా, యమున పాత్రలు పెద్దగా ఎస్టాబ్లిష్ కాలేదు. గిన్నిస్ బుక్‌లో ఎక్కిన తమిళ క్యారక్టర్ నటీమణి మనోరమ యాక్షన్ సీన్లు లేక పోయినా తన గొంతుకు తానే డబ్బింగ్ చెప్పుకొని అప్పటి గొంతు అరువు తెచ్చుకొనే హీరో, హీరోయిలను ఆదర్శమైంది. పందులోళ్లుగా బాబూమోహన్, సెంథిల్‌ల వేషాలు పాత్రోచితంగా సరిపోయినా నటన ఎబ్బెట్టు. సుధాకర్ మారని కామెడీ ట్రాక్‌ను ఎన్నాళ్లు చూడగలరు?

తాళి కట్టించు కోకుండా తల్లైన ఆడదాన్ని పతిత అంటారు - మరి మోసగించిన మగవార్ని ఏమనాలి? వంటి అరకొరా మాటలు; రోజాను వినోద్ కుమార్ హత్తుకొన్నప్పుడు టచ్ మి నాట్ చెట్టును చూపించిన తీరు కొత్తగా వుంది. శ్రీ సంగీతం ప్రసాద్‌బాబు కెమెరా బాగున్నాయి

### సంతాప సభ

4 పేజీ కొరవ

శ్రీయుతులు వాకాటి పెంచలురెడ్డి, కొండా బలరామరెడ్డి, సి.సి. సుబ్బరాయులు శెట్టి తదితరులు మాట్లాడారు. శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు స్వీయకవితతో నీరాజనా లర్పించగా, వర్ధమాన సమాజం కార్యదర్శి శ్రీ బి.వి. నరసింహాలు వందనాలు చెప్పారు. సభా ప్రారంభానికి ముందు సంతాప సూచకంగా రెండు నిముషాల మౌనాన్ని పాటించారు.

### పారితోషికం

13 పేజీ కొరవ

ఇటీవల బాలకృష్ణ, నాగార్జున కూడా తమరేట్లు 75 లక్షలకు పెంచేశారని తెలిసి కొందరు నిర్మాతల గుండెలు గుభేలు మన్నాయి.

### అక్కినేని, జగపతిబాబు నటించే చిత్రం

"రక్షణ" దర్శకుడు ఉప్పలపాటి నారాయణ రావు దర్శకత్వం వహించే ఎ.ఎన్.ఆర్. ఆర్ట్స్ చిత్రంలో అక్కినేని -రోహిణి హట్టంగడి, జగపతి బాబు - ఆమని ప్రధాన పాత్రధారులు.

### అక్కినేని, బాలకృష్ణ "గాండీవం"

"మూడు పాటలను డెన్మార్క్‌లోని కో పెన్‌హగన్‌లో చిత్రీకరించాం" అన్నారు ప్రియదర్శన్. ఈయన దర్శకత్వం వహించే శ్రీ లక్ష్మి నరసింహా కంబైన్స్ "గాండీవం" చిత్రంలో అక్కినేని, బాలకృష్ణ, రోజా, రూపిణి, శ్రీవిద్య, వై. విజయ, స్వప్న, నాగేష్, బ్రహ్మానందం, గిరిబాబు, శ్రీకన్యరాజా, అల్లు రామలింగయ్య, ముఖేష్ పాత్రధారులు. సంగీతం: కీరవాణి.

### సత్యనారాయణ చిత్రంలో అక్కినేని, దాసరి

అక్కినేని, శారద, హరీష్, సౌందర్య జంటలతో కైకాల సత్యనారాయణ సమర్పించే రమా ఫిలిమ్ తాజా చిత్రానికి దాసరి నారాయణ రావు దర్శకుడు.

### ముష్ఫాతిక కోటి" హీరోలు టైటిల్ మార్పుకు వినతి

పవిత్రమైన తమ వృత్తిని న్యూనత పరచే రీతిలో ఉన్నందున "రౌడీ టీచర్" టైటిల్‌ను మార్చమని తమకు టీచర్స్ యూనియన్ వారు నిర్మాతలను కోరారట.

### నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

ఎస్.ఎస్. ఫిలిమ్స్ "ఇల్లరికపు అల్లుడు", కామాక్షి ఆర్ట్ మూవీస్ "సెభాష్ అల్లుడు", శ్రీ సాయిజ్యోతి ఆర్ట్స్ "ప్రెసిడెంటు గారి అల్లుడు", శ్రీహరి కంబైన్స్ "ప్రెసిడెంటు గారు", నాగలక్ష్మి ప్రొడక్షన్స్ "చలమయ్య గారి మనుమడు", శ్రీలక్ష్మి విఘ్నేశ్వరా ఫిలిమ్స్ "కొత్త పెళ్లాం - పాత మొగుడు", సాయిరాం ఆర్ట్ ప్రొడక్షన్స్ "పోకిరి మొగుడు", సుమంత్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "పోలీస్ లాకప్", మధుసాయి ప్రొడక్షన్స్ "అల్లరి ఖైదీలు", శ్రీ పరమేశ్వరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "పోలీస్ దాడి", శ్రీ సాయికృపా ప్రొడక్షన్స్ "రౌడీ జమీందార్", చిరంజీవి ఫిలిమ్ మేకర్స్ "రౌడీ గారు", ఎ.ఎస్. కంబైన్స్ "కరోడా", రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "అబ్బాయిగారు", శ్రీ వేదవ్యాస చలన చిత్ర "సృష్టి", అన్నపూర్ణ స్టూడియోస్ "విజయం", శ్రీ ఆంజనేయ పిక్చర్స్ "నిర్వచన", పృథ్వీ ఫిలిమ్స్ "అంతర్యం", స్నేహచిత్ర పిక్చర్స్ "ఎర్రసైన్యం", సూర్యా ఆర్ట్ ప్రొడక్షన్స్ "హృదయ స్పందన", శరణుప్రియా ఆర్ట్స్ "సమైక్య భారతం", అన్నపూర్ణ స్టూడియోస్ "శతాబ్దం", చిరంజీవి ఫిలిమ్ మేకర్ "రాజసింహ".




Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,